# తెలుగు క్రీడా జగత్తులో ఆది పురుషులు

ఏకా వేంకట సుబ్బారావు



# తెలుగు
# క్రీడా జగత్తులో
# ఆది పురుషులు

ఏకా వేంకట సుబ్బారావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

తెలుగు క్రీడా జగత్తులో ఆదిపురుషులు – ఏకా వేంకట సుబ్బారావు

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : జూలై, 2000



వెల: రూ.18-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ – 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు–29. ఫోన్: 3229831

# నామాట

ప్రపంచ క్రీడా రంగంలో ఏ వసతులు, వనరులు లేని ఆ రోజుల్లో విశేష కృషి చేసి తెలుగు వారి ప్రతాపాలను దేశ, విదేశాలలో ప్రదర్శించి మన్ననలను పొందారు కొందరు. వారిని ఈ రోజు అనుకునేవారు లేరు. అవును! ఎందుకు అనుకోవాలి? భారతదేశ స్వాతంత్ర్యం తెచ్చి పెట్టిన మహానుభావులను తలుస్తున్నారా? ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోసం ప్రాణాలను అర్పించిన మహానుభావులను తగిన రీతిలో ఎవరయినా అనుకుంటున్నారా? 'మాకు పాతవారిని గురించి తెలుసుకోవలసిన అగత్యం ఏమిటి?' అని ప్రశ్నించే రోజులు ఇవి. ఒక మిత్రునితో మాటల సందర్భంలో, ఒక నాటి క్రీడా మహానుభావుని గురించి తెలియజేయగా – 'ఈ పేరు ఎక్కడా వినలేదే!' అన్నారు. వెంటనే 'నేను అటువంటి వారి చరిత్రలు వెలుగులోకి తెస్తాను–చదువుకోండి' అని అన్నాను. ఈ విషయం 'ఉపాధ్యాయ చైతన్య' అధిపతులలో ఒకరికి తెలియజేయగా – వారు 'ఓ.కె' అన్నారు. దాని పర్యావసానమే ఈ చిరుపొత్తం!

దీన్ని గ్రంథరూపంలో ప్రచురణకు అంగీకరించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి కృతజ్ఞతలు.

– ఏకా వేంకట సుబ్బారావు

# ఇందులో...



★ ★ ★

# కోట రామస్వామి నాయుడు



భారతదేశ టెన్నిస్ చరిత్రలో ప్రప్రథమంగా డేవిస్ కప్ పోటీలలో భారత జట్టు తరపున పాల్గొన్న ప్రప్రథమ ఆంధ్రుడు శ్రీ కోట రామస్వామి నాయుడు గారి జననం 16 జూన్, 1896.

శ్రీ రామస్వామి తాతగారి హయాంలోనే మద్రాసు వెళ్ళి స్థిరపడ్డారు. ఈయన తండ్రిగారు బుచ్చిబాబునాయుడు. వీరి అన్నదమ్ములు అయిదుగురిలో పెద్దవారు వీరు. వీరి కుటుంబంలో అందరూ క్రీడాకారులు కావడం విశేషం. మద్రాసు, మైలాపూర్‌లోని 'లజ్ హౌస్' క్రీడల నిలయం. 20 ఎకరాల విస్తీర్ణం కల యింటి ఆవరణలో రెండు టెన్నిస్ కోర్టులు, క్రికెట్ పిచ్ ఉండేవి. వీరి యింట్లో ఎన్నో గుర్రాలు ఉండేవి. బుచ్చిబాబు నాయుడుగారు రోజూ ఉదయం గుర్రపు స్వారీ చేసేవారు. రెండు టెన్నిస్ కోర్టులలో ఒక కోర్టును స్త్రీలకు కేటాయించారు.

టెన్నిస్ ఆడేందుకు విదేశీయులు కూడా వెళ్ళేవారు. టెన్నిస్, క్రికెట్ ఆటలకు కావలసిన క్రీడా సామగ్రిని వీరే తెప్పించేవారు. కొన్ని విదేశాల నుండి కూడా తెప్పించారు. పిల్లలందరూ యింట్లోనే చదువుకోవాలి, ఆడుకోవాలి. టెన్నిస్, క్రికెట్ క్రీడలలో శిక్షణ యిప్పించేవారు.

బుచ్చిబాబు సోదరులు మరికొందరు కలసి మద్రాసు క్రికెట్ అసోసియేషన్‌ను స్థాపించారు. మద్రాసు యునైటెడ్ క్లబ్ (M.U.C)ను కూడా స్థాపించారు. ప్రముఖ క్రికెటర్ రంజీగారు మద్రాసు వచ్చినపుడు, వారిని ఆహ్వానించి యమ్.యు.సి.లో ఆడించారు. 1908 వ సంవత్సరం యూరోపియన్లు, భారతీయుల జట్ల మధ్య క్రికెట్ పోటీను బుచ్చిబాబు గారు ఏర్పాటు చేశారు. ఆ పోటీ జరిగిన కొద్ది రోజులకే బుచ్చిబాబుగారు స్వర్గస్తులైనారు. ఆ దిగులుతోనే బుచ్చిబాబుగారి భార్య కూడ మూడు మాసాలకే భర్తను చేరుకున్నారు. అప్పటివరకు ఆ వంశంలోనివారికి మంచి చెడు కూడా తెలియదు. అప్పటికి కోట రామస్వామి గారికి 12 సంవత్సరాలు. తాతగారికి దత్తత వెళ్ళారు. పిల్లలు ఎవ్వరికీ 'లజ్ హౌస్' తప్ప బయట ప్రపంచం తెలియదు.

తండ్రి, పిన తండ్రులు టెన్నిస్ ఆడుతుంటే, వెనుక నిలబడి బంతులు అందించేవారు. వారు ఆడి కూర్చున్న తర్వాత, తండ్రిగారి టెన్నిస్ రాకెట్ తీసుకొని బంతులు కొట్టేవారు. పిల్లవాని ఆసక్తికి తండ్రి సంతోషించారు. ఆ విధంగా ఇంటి కాంపౌండ్‌లోనే ఉన్న టెన్నిస్ కోర్టులో టెన్నిస్ క్రీడకు నాంది పలికింది. తల్లితండ్రుల మరణానంతరం సోదరులతో కలిసి 1909 వ సంవత్సరం వెస్లీ కళాశాల హైస్కూల్‌లో చేరారు. పాఠశాలలో చదువుతోపాటు క్రికెట్, హాకీ, టెన్నిస్ క్రీడలలో మంచి నైపుణ్యం చూపారు. 1909 అంతర్ పాఠశాలల క్రికెట్ పోటీలలో ప్రప్రథమంగా ఒక పోటీలో రామస్వామి గారు ఒక్కరే 132 పరుగులు చేశారు!

ఒక పర్యాయం అంతర్ కళాశాలల పోటీలలో వెస్లీ కళాశాల జట్టులో రామస్వామి గారిని ఎంపిక చేశారు. ఆ రోజుల్లో పాఠశాల విద్యార్థులు కూడా కళాశాల పోటీలలో పాల్గొనే అవకాశం ఉంది. కానీ ఏ కళాశాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నారో – ఆ పాఠశాల ఆ కళాశాలకు అనుబంధమై ఉండాలి. రామస్వామిగారు వెస్లీ కళాశాల పాఠశాలలో చదువుతున్నారు. కాబట్టి వెస్లీ కళాశాలకు ఆడే అర్హత

లభించింది. 'పెన్నిక్విక్ ట్రోఫీ' అంతర కళాశాలల తుది పోటీలలో ఆనాటి ప్రముఖ జట్టు అయిన ఇంజనీరింగ్ కళాశాల జట్టును వెస్లీ కళాశాల ఢీ కొన్నది. ఇంజనీరింగ్ కళాశాల 250 పరుగులు చేసింది. వెస్లీ జట్టు తొమ్మిది వికెట్లకు 50 పరుగులు మాత్రమే చేసింది. అంతా ఇంజనీరింగ్ కళాశాల గెలుస్తుందని భావించారు.

చివరగా రామస్వామిగారు బ్యాటింగ్‌కు వచ్చారు. వారికి తోడు నీరోజి ఉన్నారు. ఆయనను అవుటు కాకుండా జాగ్రత్తగా ఉండమని చెప్పి, రామస్వామి విజృంభించారు. ఎంత మంది బౌలర్లు మారినా వారిని అవుటు చేయలేక పోయారు. రామస్వామి గారు 188 పరుగులు చేసి అవుటు కాకుండా విజయం చేబట్టి ప్రేక్షకులను ఆశ్చర్య చకితులను చేశారు. నీరోజి గారు 28 పరుగులు చేశారు. వెస్లీ కళాశాలలో వున్నంత కాలం అనేక విజయాలకు కారకులైనారు.

1914 వ సంవత్సరం ప్రెసిడెన్సీ కళాశాలకు రామస్వామిగారు మారారు. ఆ కళాశాలలో 1918 సంవత్సరం వరకు అంతర్ కళాశాల పోటీలలో విజయాలు సాధించడానికి కారకులైనారు. వీరు క్రికెట్ పోటీలలో ఉన్నంత కాలం ప్రేక్షకులు 'సిక్సర్' కొట్టాలని కోరేవారు.

1919 వ సంవత్సరం ఉన్నత విద్యకై కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చేరడం జరిగింది. మొదట్లో క్రీడారంగంలో ప్రవేశం లభించలేదు. రామస్వామిగారు క్రికెట్, టెన్నీస్ క్రీడాకారులని కొంతమంది భారతీయులకు మాత్రం తెలుసు. హైదరాబాదుకు చెందిన మహమ్మద్ హుస్సేన్, మరియు అలహాబాద్‌కు చెందిన యస్. కె. రుద్ర గార్లతో బాగా స్నేహం ఏర్పడింది. అప్పటికే టెన్నీస్‌లో 'హాఫ్ బ్లూ' పొందిన సీనియర్ ఆటగాడు సుందరదాస్ మంచి పేరులో ఉన్నారు. ఆయనతో పోటీ చేయాలని రామస్వామి గారికి కోరిక కల్గింది. అతి కష్టం మీద ఒక సెట్టు ఆడటానికి అంగీకరించారాయన. ఆ సెట్టు రామస్వామి గెలుపొందారు. దాంతో సుందరదాస్ అవమానంగా భావించి మూడు సెట్లు ఆడా లన్నారు. రామస్వామి ఒప్పుకొన్నారు. రెండవ సెట్ కూడా రామస్వామి గారు గెలిచారు. వెంటనే అయిదు సెట్ల మ్యాచ్ అన్నారు. రామస్వామి గారు సరేనని చెప్పి మూడవ సెట్టు కూడా గెలిచారు. ఏడు సెట్ల మ్యాచ్ అన్నారు. దాంట్లోకూడా నాల్గవ సెట్టు సుందరదాస్ ఓడిపోయారు. రామస్వామి గారి మిత్రులందరూ ఆనంద

పరవశులై టెన్నీస్ క్రీడలో ప్రోత్సాహం యిచ్చారు. 1920 టెన్నీస్ సీజన్ ప్రారంభమయింది.

ఆ సీజన్‌లో జరిగిన అనేక టెన్నీస్ పోటీలలో సులభంగా విజయాలు సాధించారు. సీజన్ ముగింపు సమయంలో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం ఓపెన్ టెన్నీస్ సింగిల్సు పోటీలను నిర్వహించారు. అందులో కూడా రామస్వామిగారు విజయం సాధించి, 'డోహెర్టీకప్'ను చేపట్టారు. అందుకుగాను వారికి 'హాఫ్ – బ్లూ' యిచ్చారు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం జట్టులో ఎన్నికైనారు. జట్టు నాయకులు బైన్స్. ఆ జట్టులో సుందరదాస్, మెక్‌లు కూడా ఉన్నారు. ఆ జట్టులో – చివరి సంవత్సరంలో వున్నారు కాబట్టి రామస్వామి గారికి డబుల్స్ పోటీలలో పాల్గొనే అవకాశం లభింపచేశారు.

1921 వ సం॥ కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయము రామస్వామి గారిని పూర్తి 'బ్లూ'తో సత్కరించి, విశ్వవిద్యాలయ టెన్నీస్ జట్టులో ఎంపిక చేసి, బెల్జియమ్, హాలెండ్‌లలో జరిగిన ప్రపంచ విశ్వవిద్యాలయాల పోటీలకు పంపించారు. వీరి ప్రతిభను గుర్తించి, నార్వేక్‌లో జరిగిన ఓపెన్ టెన్నీస్ పోటీలకు ఆహ్వానించారు. ఈ పోటీలలో సింగిల్సు, డబుల్స్‌లలో తుది పోటీకు, మిక్స్‌డ్ డబుల్సులో సెమీ ఫైనల్‌కు చేరుకున్నారు.

ఒకరోజు ముందుగా పోటీ నిర్వాహకులు అన్ని పోటీలు ఒకే రోజు జరపనున్నట్లు తెలియజేశారు. రామస్వామి గారికి అది అగ్నిపరీక్ష! ఉదయం 10–30 గం. మిక్స్‌డ్ డబుల్స్ సెమీఫైనల్. అందులో ఓడిపోయారు. వెంటనే 1–30 గం. సింగిల్సు తుది పోటీ. ఇందులో హాలెండ్ ఛాంపియన్ అయిన ఒన్–డెర్–ఫిన్‌తో ఢీ కొన్నారు. రామస్వామిగారు అతి కష్టం మీద అయిదు సెట్లు ఆడి ఓడించారు, ఆ పోటీ అయిన వెంటనే అరగంట విరామం ఇచ్చి డబుల్సు పోటీను ఏర్పాటు చేశారు. రామస్వామి గారి జంట హైదరాబాదు వాస్తవ్యులు శ్రీ యస్. యమ్. హాదీ.

ఈ పోటీ హాలెండ్ ఛాంపియన్లు అయిన బిన్–లెగునె, కాస్టర్ డెక్‌లతో జరిగింది. ఆట ప్రారంభంలోనే రామస్వామిగారు పరిస్థితి బాగా లేదని హాదీ గారికి తెలియచేసుకున్నారు. హాదీగారు రామస్వామి గారికి అభయం ఇచ్చారు. పోటీ హోరా హోరీ అయిదు సెట్లు సాగింది. అంతిమ విజయం రామస్వామి, హాదీ గార్లకు లభించింది. రామస్వామి

గారికి పట్టరాని ఆనందం కల్గింది. ఒకేరోజు మూడు పోటీలలో పాల్గొన్న రామస్వామి గారికి మూడు రోజులు భోజనం, నిద్ర లేకుండా పోయాయి.

భారత లాన్ టెన్నీస్ సంస్థ దృష్టి రామస్వామిగారి మీద పడింది. 1922 వ సం॥ ఆయన గారిని భారతదేశం పిలిపించి, డేవిస్ కప్ పోటీలలో పాల్గొన నున్న భారత్ జట్టులో ఎంపిక చేసినట్లు తెలియజేశారు. ఆ జట్టు యితర సభ్యులు డా. ఎ. హెచ్. ఫిజి, ఆయన సోదరుడు ఏ. ఏ. ఫిజి. ప్రప్రథమంగా బ్రిస్టల్‌లో జరిగిన పోటీలో భారత జట్లు రుమేనియాను ఓడించింది. రెండవ పోటీ బెకెన్‌హామ్‌లో స్పెయిన్‌తో జరిగింది. ఆ రోజుల్లో ప్రపంచ టెన్నీస్ రంగంలో ప్రతిష్టాకరమైన జట్టు స్పెయిన్‌తో ఓటమి సంభవించింది. ఇందులో రామస్వామి, డా. ఫిజి గారలు డబుల్సు పోటీలలో మాత్రం విజయం సాధించారు.

1922 లో భారతదేశం నుండి తిరిగి వెళ్ళగానే, అక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ టెన్నీస్ జట్లలో ఎంపిక అయి, ఇంగ్లండ్ విశ్వవిద్యాలయంతో పోటీ చేశారు. అదే సంవత్సరం అక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయాల జంట జట్టు అమెరికా వెళ్ళవలసి వచ్చింది. నల్లజాతి వాళ్ళను పంపడం యిష్టం లేక రామస్వామి గారిని ఎంపిక చేయలేదు. ఈ విషయం తెలుసుకున్న జట్టు నాయకులు బి. విలియమ్స్ గారు మాత్రం జట్టులో రామస్వామి గారు ఉండాలని పట్టు పట్టారు. విశ్వవిద్యాలయ అధికారులు ఏమీ చేయలేక రామస్వామి గారిని కూడా పంపించారు. చివరి సంవత్సరం విశ్వవిద్యాలయ అధికారులకు తెలియకుండా ఇంగ్లండ్‌లో జరిగిన ఒకానొక పెద్ద టెన్నీస్ పోటీలలో పాల్గొన్నారు. ఈ విషయం గోప్యంగా ఉండాలని పేరు ఏ. రాబిట్‌గా మార్చుకున్నారు. ఆ టోర్నమెంట్ గెలవగానే పత్రికల వారు క్వీన్ క్లబ్‌లో టోర్నమెంటు విజేత 'ఏ రాబిట్ అని పిలవబడే రామస్వామి' అని గుట్టును బహిర్గతం చేశారు. డబుల్సులో సి. హెచ్. కింగ్స్‌లె జంటగా విజయం సాధించారు.

జనవరి 1924 న భారతదేశం వచ్చారు. అక్టోబరు 1924 న మద్రాసు వ్యవసాయ డిపార్టుమెంట్‌లో అధికారిగా నియమితులైనారు. ప్రప్రథమంగా మద్రాసులోనే నియమించారు. ఉద్యోగ రీత్యా నెలకు 15, 20 రోజులు పల్లెలకు వెళ్ళవలసి వచ్చింది. రామస్వామి గారి పైఅధికారికి క్రీడలంటే గిట్టవు. ఉద్యోగానికి న్యాయం చేయాలనే అధికారి. అటువంటి అధికారి మద్రాసులో జరిగిన ఒక టెన్నీస్ పోటీని

ప్రేక్షకులలో నిలబడి చూసారు. కొద్ది మాసాలలో దక్షిణ అర్కాట్‌లోని తిండి వనంకు బదిలీ అయ్యారు. కొంతమంది అధికారులతో కలసి సరదాగా దగ్గరలో ఉన్న అడవిలోకి వెళ్ళారు. తలవని తలంపుగా ఒక తుపాకి తూటా రామస్వామిగారి కుడి చేతి మణికట్టుపైన తగిలింది. ఆ తూటా శబ్దం ఎక్కడి నుండి వచ్చిందా? అని చూసారే కాని, తమకు తగిలిందని తెలుసుకోలేక పోయూరు.

అది అనుకోకుండా జరిగిన సంఘటన, రామస్వామి గారిని వెంటనే మద్రాసు ఆస్పత్రికి తరలించారు. ఆస్పత్రిలో డా. రంగాచారి వెంటనే శ్రద్ధ తీసుకొని, ఆందోళన పడవలసిన అవసరం లేదని తెలియజేశారు. సంవత్సరం తర్వాత చెయ్యి స్వాధీనంలోకి వచ్చింది. బాగా నయమయిన తర్వాత రామస్వామి గారిని బళ్ళారి బదిలీ చేశారు. రామస్వామి గారి స్వంత జట్టు అయిన మద్రాసు యునైటెడ్ క్లబ్‌తో బొంబాయి, పూనాలలో కొన్ని క్రికెట్ పోటీలలో పాల్గొన్నారు. ప్రతి పోటీలోనూ 50 పరుగులు తక్కువ కాకుండా చేసి పేరు సంపాదించారు.

వీరి ప్రతిభ ఫలితంగా బొంబాయి హిందువుల జట్టులో ఎంపిక అయి, ప్రతి సంవత్సరం జరిగే చతుర్ముఖ పోటీలలో పాల్గొన్నారు. వీరు పాల్గొన్న జట్టుకు విజయం లభించింది. 1928 వ సంవత్సరం వివాహమయింది. అదే సంవత్సరం వీరిని గుంటూరు బదిలీ చేశారు. ఆ రోజుల్లో గుంటూరు టెన్నీస్ క్రీడకు ప్రసిద్ధి. అనేక మంది అంతర్జాతీయ ఖ్యాతి గడించిన క్రీడాకారులు ఉండేవారు. 1932 లో ఢిల్లీలో జరిగిన అంతర్ ప్రాంతీయ పోటీలలో పాల్గొన్న జట్టు నాయకులు రామస్వామి. వారి జట్టుకే విజయం లభించింది. ఆ జట్టులో వీరితో పాటు టి.టి. బాలగోపాల్, యన్. కృష్ణస్వామి, యన్. వెంకట్రావు పాల్గొన్నారు. డబుల్సులో వీరికి జంట యన్. కృష్ణస్వామి.

ఆ తర్వాత కలకత్తా, అలహాబాద్, బొంబాయి, లాహోర్ మున్నగు ప్రాంతాలలో జరిగిన అనేక టెన్నీస్ పోటీలలో పాల్గొని విజయాలు సాధించారు. సెలవు నుండి తిరిగి రాగానే రామస్వామి గారిని కుద్దలూరు (దక్షిణ అర్కాట్)కు బదిలీ చేశారు. అక్కడా క్రికెట్ క్రీడకు ప్రాధాన్యత ఇచ్చారు. కొన్ని పోటీలలో మద్రాసు జట్టుకు నాయకత్వం వహించారు. మద్రాసుకు విచ్చేసిన ఆస్ట్రేలియా జట్టుతో ఆడారు. 1936లో బ్రిటన్‌లో 'విజ్జీ' నాయకత్వాన పర్యటించిన భారతజట్టు సభ్యులు.

అప్పుడు వారి వయస్సు 40 సంవత్సరాలు. ఇంత పెద్ద వయస్సులో మరే భారతీయుడు టెస్ట్ క్రికెట్ రంగంలో ప్రవేశించలేదు. చివరిసారిగా 1940 వ సంవత్సరం మద్రాసు ప్రెసిడెన్సీ పోటీలలో పాల్గొని, 105 పరుగులు చేశారు. క్రీడా రంగం నుండి క్రీడాకారునిగా విరమిస్తున్నట్లు ప్రకటన చేశారు. కానీ బలవంతంగా మద్రాసు క్రికెట్ జట్టులో ఎంపిక చేసి రంజీ ట్రోఫీ పోటీలకు దింపారు. ఆ పోటీలలో న్యాయం చెయ్యలేకపొయ్యారు. అదే ఆ క్రీడాకారుని రిటైర్మెంట్.

ప్రభుత్వ సర్వీస్ నుండి రిటైర్ అయిన తర్వాత, 1951 నుండి 59 వరకు క్రికెట్ కంట్రోల్ బోర్డు జట్ల ఎంపిక సభ్యులుగా వ్యవహరించారు. 1952–53 లో వెస్ట్ ఇండీస్ పర్యటించిన భారత క్రికెట్ జట్టుకు మేనేజరు. 1955 నుండి భారత బాల్ బ్యాడ్ మింటన్ ఫెడరేషన్ అధ్యక్షులుగా ఉండి, బాల్ బ్యాడ్ మింటన్ క్రీడాభివృద్ధికి పాటుపడ్డారు.

89 సంవత్సరాల వయస్సులో కూడా ప్రతి రోజు ఉదయం కొంత దూరం నడిచి వెళ్ళి వస్తుండేవారు. 13 అక్టోబరు, 1985 వ తేదీన మామూలుగా బయటకు వెళ్ళినవారు తిరిగి రాలేదు. అంతర్యం ఏమిటో సృష్టికర్తకే తెలియాలి.

★ ★ ★

# సి.కె. నాయుడు



క్రీడారంగ అవతార పురుషుల కోవకు చెందిన క్రీడాగ్రేసరులు ఆంధ్రులలో కొందరు ఉన్నారు. అటువంటి వారిలో ముఖ్యంగా చెప్పదగిన వారు కర్నల్ సి.కె. నాయుడు. అసలు పూర్తిపేరు కఠారి కనకయ్య నాయుడు. ప్రపంచ క్రికెట్ క్రీడారంగంలో చెరగని ముద్రవేసి తనువు చాలించిన మహానుభావుడు. భారత క్రికెట్ చరిత్రలో నాలుగు దశాబ్దాలకు పైగా సర్వతోముఖ ప్రతిభాశాలిగా ప్రముఖ స్థానం వహించారు. క్రికెట్ ఆట ప్రమాణం పెంపొందించడానికి వీరిని మించి మరెవ్వరూ కృషి చేసి వుండలేదు. క్రికెట్ ప్రపంచంలో ఆయన 'సి.కె.'గా పరిచితులు. ఉత్తమ క్రీడాకారునికి వుండవలసిన లక్షణాలన్నింటిని, సృష్టికర్త ఆయనకు ప్రసాదించాడు. శరీర సౌష్టవంలోనే కాకుండా, వినయ విధేయతలలో కూడా ఆయన మూర్తీభవించిన క్రీడాకారుడు. వారి హస్తాలలో బ్యాటింగ్ ఒక కళగా రూపొందింది. వారి మణికట్టులో మహత్తు వుందంటారు.

నాయుడుగారి పెద్దలు మచిలీపట్నంలో వుంటూ, మకాం నాగపూర్‌కు

మూర్చారు. 'సి.కె.' గారి జననం 31, అక్టోబరు 1895. కఠారి కుటుంబం నాగపూర్‌లో స్థిరపడిన తరువాత, నాయుడుగారు ఏడేళ్ళ ప్రాయంలో ఫుట్ బాల్, హాకీ, టెన్నీస్, అథ్లెటిక్స్ క్రీడలలో ప్రకాశిస్తూ వుండేవారు. చిన్నతనంలోనే షేక్స్పియర్ నాటకాలలో కూడా పాల్గొన్నారు. పాఠశాలలో చదివే రోజుల్లోనే క్రికెట్ జట్టులో ఆటగానిగా అడుగుపెట్టి, అంతర్జాతీయ భవిష్యత్తుకు పునాది వేశారు. పాఠశాలలో చదివే రోజుల్లో క్రికెట్ క్రీడలో అంతగా రాణించలేదు. నాయుడు గారి తండ్రి 'కేంబ్రిడ్జ్'లో రంజీ సహాధ్యాయులు. సి.కె.కు క్రికెట్ క్రీడలో మెలుకువలను తెలుపవలసిందిగా తండ్రికి సలహా యిచ్చారు. ఆ సలహా మేరకు నాయుడు గారి తండ్రి నాగపూర్‌లో ఉన్నప్పుడు, క్రికెట్ క్రీడను గురించి క్షుణ్ణంగా తెలియచేశారు. రోజూ బాగా వ్యాయామం కూడా చేయించారు. తండ్రి ఆదేశంమేరకు నాయుడుగారు క్రికెట్ క్రీడలో కృషి చేశారు.

భారతదేశంలో ప్రప్రథమంగా బొంబాయిలో ఆనాటి గవర్నర్ లార్డ్ హారీస్ ప్రతి సంవత్సరం ఆంగ్లేయులు, పార్శీల జట్లమధ్య పోటీలను ప్రారంభించారు. 1907 వ సంవత్సరం హిందువుల జట్టు ఏర్పడడం వల్ల మూడు జట్లమధ్య పోటీ జరిగినది. 1912 లో ముస్లిమ్స్ జట్టు ఏర్పడగా, నాలుగు జట్లకు పోటీలు జరిగినవి. 'సికె' గారికి ప్రప్రథమంగా 1916 వ సంవత్సరం హిందువుల జట్టులో ప్రవేశం లభించుట వల్ల ప్రథమ శ్రేణి క్రికెట్ పోటీలలో పాల్గొనే అవకాశం లభించింది. 1923 లో బొంబాయిలో జరిగిన నాలుగు జట్ల పోటీలలో ఆంగ్లేయులు, హిందువుల జట్లు తుది పోటీకు నిలబడ్డవి. ఆ పోటీలో ఆంగ్లేయులు 481 పరుగులు చేయగా, హిందువుల జట్టు 475 పరుగులు చేసింది. అందులో సి.కె. గారు 76 పరుగులు చేసారు. 1926–27 లో యమ్.సి.సి. జట్టు భారతదేశంలో పర్యటించినపుడు నాయుడు గారు బొంబాయిలో హిందువుల జట్టు తరఫున యమ్.సి.సి. జట్టుతో ఆడుతూ ఒక యిన్నింగ్స్‌లో 11 సిక్సర్స్ కొట్టారు. ప్రేక్షకులు ఆనందోత్సాహాలతో 'సిక్సర్ కొట్టండి' అని నినాదాలు చేసేవారు.

ప్రప్రథమంగా బ్రిటన్‌లో పర్యటించిన భారతజట్టుకు నాయకత్వం వహించారు. ఇదే విదేశాలలో పర్యటించి టెస్ట్ తొలిపోటీలలో పాల్గొన్న భారత జట్టు. ప్రప్రథమ టెస్ట్ పోటీ లార్డ్స్‌లో ఇంగ్లండ్ జట్టుతో 25,

27, 28 జూన్, 1932 లో జరిగింది. అదే సంవత్సరం బర్మింగ్ హామ్‌లో పోటీ చేసినప్పుడు నాయుడుగారు అరు సిక్సర్స్, పదమూడు బౌండరీలు చేశారు. ఒక బంతి మాత్రం ఆటస్థలం ప్రక్కన ఉన్న నదిలో పడింది. స్వాన్‌సె పోటీలో సి.కె. గారి 50 పరుగుల దగ్గర, వెయ్యి పరుగులు పూర్తి చేసారని ప్రకటించారు. ఆ పోటీలో 67 పరుగులు చేసారు. సెంచరీలు చేసిన సన్నివేశాలు చాలా ఉన్నాయి. 1933-34 లో ఇంగ్లండ్ జట్టు భారతదేశ పర్యటన చేసి, మూడు టెస్ట్ పోటీలలో పాల్గొన్నది.

మొదటి టెస్ట్ పోటీ బొంబాయి జింఖానాలో 15 నుండి 18 డిసెంబరు 1933 లో జరిగింది. ఆ తర్వాత రెండు టెస్ట్ పోటీలు కలకత్తా, మద్రాసులలో జరిగినవి. 1936 లో ఇంగ్లండ్ పర్యటించిన భారత జట్టుకు విజయనగరం మహారాజకుమార్ (విజ్జి) నాయకులు. ఆ జట్టులో సి.కె. గారు కూడా ఉన్నారు. ఆ పర్యటనలోని చివరి టెస్ట్ పోటీ ఓవర్‌లో జరిగింది. అందులో సి.కె. 81 పరుగులు చేశారు. అప్పటికి వారి వయస్సు 41 సంవత్సరాలు. 1932 వ సంవత్సరం ప్రపంచ మేటి ఆటగాళ్ళ అయిదుగురిలో వీరు ఒకరు. ఆ ఘనత లభించినప్పుడు అంతటివాడు కావడానికి కారకులు తన తండ్రిగారేనని పెద్దలకు, పత్రికా ప్రతినిధులకు తెలియచేసుకున్నారు.

రంజీట్రోఫీ పోటీలలో 1938 వరకు సెంట్రల్ యిండియా జట్టుకు నాయకత్వం వహించారు. సి. కె. గారి క్రికెట్ ప్రతిభను గుర్తించి, ఇండోర్‌కు చెందిన మహారాజా టుకోజీరావ్ హోల్కర్, నాయుడు గారిని సైనికదళం కెప్టెన్‌గా నియమించారు. 1941 నుండి హోల్కర్ క్రికెట్ జట్టుకు నాయకత్వం వహించారు. వీరి నాయకత్వంలో హోల్కర్ క్రికెట్ జట్టు రంజీట్రోఫీ పోటీలలో ఒక ప్రత్యేక స్థానం అలంకరించింది. 1945-46, 1947-48, 1950-51, 1952-53 సంవత్సరాల్లో రంజీ ట్రోఫీ పోటీలలో విజయం సాధించగా; 1944-45 1946-47, 1949-50, 1951-52 సంవత్సరాల్లో ద్వితీయ స్థానం పొందింది. రంజీ ట్రోఫీ పోటీలలో 1943-44 సం. యునైటెడ్ ప్రావిన్స్‌తో ఆడుతున్నప్పుడు 102 పరుగులు, 1944-45 లో బెంగాల్ జట్టు మీద 141 పరుగులు, 1945-46 లో అర్ధాంతర పోటీలో మైసూరు జట్టు మీద 101 పరుగులు, తుది పోటీలో బరోడా జట్టు మీద 200 పరుగులు చేసి,

సెంచరీల 'సి.కె.' అనిపించుకున్నారు. 50 వ ఏట రంజీ పోటీలలో 200 పరుగులు చేయడం నాయుడుగారి అద్భుత శక్తికి, పటిమకు తార్కాణం.

1951 వ సంవత్సరంలో పూర్వాంధ్ర క్రికెట్ అతిరథులు ఆంధ్రా క్రికెట్ సంఘం స్థాపన విషయం ఇండోర్‌లో వున్న నాయుడు గారికి తెలియచేశారు. వెంటనే ఆయనగారు ఆనందంతో ఆమోదం తెలియజేశారు. ఈ విషయాన్ని మద్రాసు రాష్ట్రసంఘం, క్రికెట్ బోర్డుకు తెలియజేశారు. వెంటనే ఆమోదం లభించలేదు. ఒకటి, అక్టోబరు 1953 సంవత్సరం పూర్వాంధ్ర ప్రత్యేక రాష్ట్రం ఏర్పడగానే, రాష్ట్ర క్రికెట్ అసోసియేషన్ స్థాపనకు ఆమోదం లభించింది. 5, ఫిబ్రవరి 1953 న పూర్వాంధ్ర క్రికెట్ సంఘ స్థాపన నాయుడుగారి చేతిమీదుగానే గుంటూరులో జరిగింది. ఆరవ తేదీ, సి.కె., సి.యస్. జట్ల మధ్య ఒక్క రోజు క్రికెట్ గుంటూరులో జరిగింది. ఆ రోజు ఆయనగారి ఆటతీరు చూస్తుంటే యువకులు ఆయన ముందు తేలిపోయారు. అప్పటికి ఆయన వయస్సు 58 సంవత్సరాలు. రంజీట్రోఫీ పోటీలలో ప్రప్రథమంగా పాల్గొన్న పూర్వాంధ్ర రాష్ట్రజట్టు నాయకత్వం బాధ్యత నాయుడుగారి మీద పడింది. ప్రప్రథమ లీగ్ పోటీ పూర్వాంధ్ర, మైసూరు జట్లమధ్య బెంగుళూరులో 28, 29, 30 నవంబరు, 1953 న జరిగింది. సి. కె. గారు రెండవ యిన్నింగ్స్‌లో 86 నిముషాలు బ్యాట్ చేసి 74 పరుగులు చేశారు. అందులో సిక్సర్ పది బౌండరీలు.

ఉన్నత శ్రేణి క్రికెట్ పోటీల నుండి విరమిస్తున్నట్లు 23 నవంబరు, 1953 న ప్రకటన చేశారు.

సుప్రసిద్ధ బ్రిటీష్ ఆటగాడు శ్రీ జాక్ హోరబ్స్, 'సి.కెను నేను మరవలేను. సర్వతోముఖ ప్రతిభాశాలురలో ఆయనను మించిన వారు'లేరు అని కీర్తించారు.

శ్రీ జార్జ్ డక్ వర్త్ 'సి.కె. ప్రపంచ గొప్ప క్రికెటర్లలో ఒకరుగా పరిగణిస్తారు' అని అన్నారు.

'ఇండియాలో క్రికెట్ ఆట ప్రయాణం పెంపొందించడానికి సి.కె.ను మించి మరెవ్వరూ కృషి చేసి వుండలేదు' అని విజయనగరం మహారాజ కుమార్ అన్నారు.

'ప్రపంచ అగ్ర బ్యాట్స్‌మన్‌లలో కనకయ్య ఒకరు' అని డా. సుబ్బరాయన్ ప్రశంసించారు.

శారీరకంగా కలిగిన బాధను సైతం బాహ్యంగా వ్యక్తం చేయకుండా గోప్యంగా అనుభవించడమే ఆయన విశిష్ట లక్షణం. క్రికెట్ మైదానంలో అనేక పర్యాయములు దెబ్బలు తిన్నారు. అవి తీవ్రమయినప్పటికీ, ఆయన వాటిని గురించి ప్రచారం చేసుకోలేదు. క్రమశిక్షణను నిష్టగా పాటించారు. జట్టు నాయకులుగా వుంటూ, సహచరులను కూడా యిదే విధంగా పాటించాలని కోరారు.

1961–62 కలకత్తాలో భారత్, ఇంగ్లండ్ క్రికెట్ జట్లమధ్య పోటీ జరుగుతున్న సందర్భంలో సికె గారిని ప్రముఖ క్రీడా వ్యాఖ్యాత, రచయిత శ్రీ యస్. సన్యాల్ కలిసే భాగ్యం లభించింది. కామెంటర్ల బాక్స్‌లో సి.కె. గారితో ఎంత సేపు సంభాషించినా జీవిత సంధ్యాకాలంలో సి.కె. అనుభవించిన యిక్కట్లకు ఆయన ముఖ కవళికలలో కాని, మాటలలో కాని సన్యాల్ గారికి చింత గోచరించలేదు.

టెస్ట్ మ్యాచ్ నిర్వాహకులు ఒకనాటి క్రికెట్ యోధుని పట్ల చిన్నచూపు చూడడము శ్రీ సన్యాల్‌గారు గ్రహించి ఎంతగానో బాధపడ్డారు. శ్రీ సన్యాల్ గారితో 'బాధ పడడం ఎందుకండీ – నా యిన్నింగ్స్ పరిసమాప్తి జరిగింది. ఆటలో నిమగ్నమైన వారి దృష్టిని – నేను చెదర్చకుండా వుండడం మంచిది కదూ?' అని హుందాగా అన్నారు.

ఒక సందర్భంలో పత్రికా ప్రతినిధులు సి.కె. గారిని 'మీరు క్రికెట్ కాకుండా యింకా ఏ క్రీడలో కృషి చేసారు?' అని అడిగారు. దానికి ఆయన సమాధానం 'మీరు ఏ క్రీడలలో కృషి చేయలేదు? అని అడిగి వుంటే బాగుండేది' అని అన్నారట.

1964 వ సంవత్సరం మధ్యప్రదేశ్ క్రికెట్ సంఘం పాకిస్తాన్ క్రికెట్ జట్టు గౌరవార్థం ఇండోర్‌లో ఏర్పాటు చేసిన సన్మాన సభలో సి.కె. గారికి 'క్రికెట్ పిత' బిరుదును ఇచ్చారు. పాకిస్తాన్ జట్టు నాయకులు శ్రీ ఫజల్ అహమ్మద్, నాయుడుగారి పట్ల తనకున్న గురుభక్తిని వెల్లడిస్తూ, నాయుడుగారి శిష్యరికం వల్లనే తన క్రీడా కౌశల్యం పెంచుకున్నానని తెలియచేశారు. జట్టు మేనేజర్ శ్రీ జహంగిర్ ఖాన్ కూడా సి.కె. గారి మీద ఉన్న భక్తిని వెల్లడించారు.

1956 వ సంవత్సరంలో భారత ప్రభుత్వం శ్రీ కఠారి కనకయ్య నాయుడు గారికి, భారతీయ క్రికెట్‌కు వారు చేసిన సేవకు ప్రశంసాచిహ్నంగా 'పద్మ భూషణ్' బిరుదును ఇచ్చి సత్కరించింది.

క్రీడా రంగంలో క్రమశిక్షణకు ఎంత ప్రాముఖ్యం ఇచ్చారో ఇంటా, బయట కూడా అంతే ప్రాముఖ్యత యిచ్చారు. ఆయన గృహం ఒక స్వర్గసీమ. ఇంట్లో వాళ్ళు ఎక్కడికయినా బయటకు వెళ్ళాలంటే, నాయుడుగారికి చెప్పి వెళ్ళాలి. ఇంటిని పరిశుభ్రంగా వుంచాలి. ఇంట్లో ఒక చిన్న కాగితం ముక్క కిందపడివుంటే సహించేవారు కారు. దర్వాజాలు, కిటికీలు, రోజూ తుడిచి శుభ్రంగా ఉంచాలి. ఇంటి కాంపౌండ్ లో వున్న చిన్న తోట అందంగా కనిపించాలి. తెల్లవారగానే యింట్లో అందరూ నిద్రలేచి ఎవరి పనులు వారు చేసుకోవాలి. ఎవరయినా లేవకుండా పడుకొని వుంటే 'ఏదైనా అనారోగ్యమా?' అని అడిగేవారట. ఇంట్లో నిశ్శబ్దం పాటించాలి. రేడియో పెట్టుకుంటే, చిన్నగా వినపడేటట్లు పెట్టుకోవాలి. నాయుడుగారి కాలకృత్యాలు తీర్చుకొని యింటి చుట్టూ పరిశీలనకు బయల్దేరేవారు. ఆయనలా వెళ్తుంటే యింట్లో అందరికి హడలే. నిత్యం గ్రంథ పఠన చేసేవారు.

నాయుడుగారికి సంగీతమంటే ప్రాణం. వారి యింట్లో అన్ని వాయిద్యాలు వుండేవి. శాస్త్రీయ సంగీతం అంటే అభిలాష జాస్తి. సంగీత ఉపాధ్యాయులను పిలిపించి ఇంట్లోవాళ్ళకు సంగీతం నేర్పించారు. సైగల్ మరియు కన్నన్ దేవి పాటలు అంటే యిష్టం. విడుదల అయిన వారి రికార్డులను, క్యాసెట్లను తెప్పించి ఇంట్లో వినేవారు. కె. సి. డే గారి భజన కీర్తనలు అంటే మరీ ఇష్టం. వారి రికార్డులను కూడా కొన్నారు. నాయుడు గారు ఒక పర్యాయం కలకత్తా వెళ్ళినప్పుడు సైగల్ గారిని కలిసే భాగ్యం కలిగింది. నాయుడు గారు మహానందభరితుడై వారి గానం వింటూ ఒకరోజు వారితోనే గడిపారు.

నాయుడు గారికి దైవ చింతన కూడ ఎక్కువే! ఆయన గారి ఆరాధ్యదైవం శ్రీకృష్ణ పరమాత్మ. శ్రీకృష్ణ పరమాత్మ భక్తి గీతాలను ఆలాపిస్తూ ఆరాధించేవారు. క్రికెట్ రంగం నుండి విరమించిన తర్వాత దైవ కార్యక్రమాలకు ఎక్కువ ప్రాధాన్యత యిచ్చారు.

14, నవంబరు 1967 వ తేదీ ఏకాదశి. ఆరోజు నాయుడుగారి భార్య ఉదయం నుండి శాస్త్రోక్తంగా తులసి పూజ చేశారు. దొడ్లో వున్న తులసి తోటలో సాయంత్రం దాకా పూజా కార్యక్రమాలు జరిగాయి. నాయుడుగారు ఆనందోత్సాహంగా పూజా వేడుకలను తిలకించారు. కొద్దిగా చీకటి పడిన తర్వాత, ఒంట్లో బాగోలేదని చెప్పి మంచం మీద పడుకున్నారు. ఇంట్లో వాళ్లు ఆందోళన చెంది డాక్టరుకు కబురు చేశారు.

డాక్టరు వచ్చి పరీక్షించి, నాయుడుగారికి ఏమీ లేదని చెప్పి వెళ్ళారు. అదే రాత్రి భార్య ప్రక్కనే ఉండగా, నాయుడుగారు నిర్భయంగా ఆనందంగా శ్రీకృష్ణపరమాత్మలో ఐక్యమయ్యారు.

నాగపూర్‌లో సి.కె.గారి శిలా ప్రతిమను మహారాష్ట్ర క్రీడల మంత్రి శ్రీ వన్కెడే ఆవిష్కరించారు. నాయుడు గారికి గొప్ప పేరు తెచ్చిన ప్రదేశంలో వారి శిలా స్థూపాన్ని నెలకొల్పడం గొప్ప విశేషం. ఆ రోడ్డుకు సి.కె. రోడ్డు అని పేరు పెట్టారు.

★ ★ ★

# కోడి రామమూర్తి



వివేకానంద స్వాముల వారివలె, భారతదేశ కీర్తిని విదేశాలలో చాటి, విశ్వవిఖ్యాతి వహించిన ప్రప్రథమ ఆంధ్ర క్రీడాగ్రేసరులు స్వర్గీయ కోడి రామమూర్తి నాయుడు. ఆయన గారి పేరు విననివారు ఉన్నారంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది.

కోడి రామమూర్తి నాయుడు గారు 1883 వ సంవత్సరంలో విజయనగరం సమీపంలోని వీరఘట్టం అనే గ్రామంలో జన్మించారు. తల్లి రెండవ ఏటనే మరణించారు. తండ్రి రాయబహదూర్ నారాయణ స్వామి గారు పోలీసు ఇన్‌స్పెక్టర్‌గా పనిచేస్తూ, 1908 వ సంవత్సరంలో దివంగతులైనారు. నారాయణ స్వామి గారు కూడా మంచి బలవంతులు.

శ్రీ రామమూర్తి బాల్యం నుండి చదువు మీద ఎక్కువ శ్రద్ధ చూపలేదు. అందువల్లనే మూడవ ఫారం ఆరు సార్లు తప్పి, చివరికి

పాసయ్యానని అనిపించుకున్నారు. చదువు రాదని తలంచి 1895 వ సంవత్సరంలో మూడవ ఫారంతో చదువు నిలిపివేశారు. బాల్యంలో వీరు ఉబ్బస వ్యాధితో బాధపడ్డారు. ఆరోజుల్లో ఆస్పత్రులు చాలా తక్కువ. నాటువైద్యం చేసేవారు. వ్యాయామం చేయించి పెద్ద పెద్ద రోగాలను నయం చేయించిన వ్యాయామవేత్తలు ఉండేవారు. అందువల్ల నాయుడు గారు వ్యాయామంలో అధిక శ్రద్ధ చూపించారు. హనుమంతుడు భీముడు గాధలు వ్యాయామంలో ప్రోత్సహించినవి. ఆయన గరిడీని స్థాపించి, తోటి బాలురతో సంగడాలు ఎత్తడం వంటి వ్యాయామం ప్రారంభించారు.

నాయుడుగారి బలప్రదర్శనకు ఒక వృషభం కారణమయింది. ఒక ఎద్దు ఊబిలో దిగబడిపోతే ఎంత మంది అయినా పైకి తేలేకపోయారు. ఈ అపాయం చూసిన నాయుడుగారు వెంటనే ఎవ్వరి సహాయం లేకుండా ఆ ఎద్దును ఊబిలో నుండి బయటకు లాగారు. ఆనాటి నుండి దేశీయ వ్యాయామం, ఈత, గుఱ్ఱపు స్వారి యందు ఎక్కువగా తర్ఫీదు చేసి బలసౌష్టవమును ఆర్జించారు.

ప్రప్రథమంగా నాయుడుగారు విజయనగరంలోని ప్రావిన్షియల్ హైస్కూలులో వ్యాయమ ఉపాధ్యాయునిగా పనిచేశారు. తర్వాత మద్రాసు వెళ్ళి సైదాపేట వై.యమ్.సి.ఎ. వ్యాయామ కళాశాలలో వ్యాయామ ఉపాధ్యాయ శిక్షణ పొంది, విజయనగరం పాఠశాలలోనే వ్యాయామ ఉపాధ్యాయునిగా చేరారు. కొద్దికాలంలోనే వీరి మకాం మద్రాసుకు మారింది. తుని మహారాణి ఆస్థానంలో పనిచేస్తున్న పొట్టి పంతులు గారితో పరిచయం ఏర్పడింది. వారి సర్కస్ కంపెనీలో శాండోగా కొంతకాలం పనిచేశారు. పంతులుగారి ప్రోత్సాహంతో ముష్టియుద్ధం అభ్యసించి, మద్రాసులో అనేక విజయాలు సాధించారు. ఊజెన్ శాండో అనే జర్మనీ బలశాలిని మించిన బలం సంపాదించాలని వ్యాయామం తీవ్రతరం చేసారు. 1905 వ సంవత్సరంలో మద్రాసులో అనేక బలప్రదర్శనలను ఇచ్చారు. నాయుడు గారి ప్రదర్శనలను మద్రాసు గవర్నర్, అయిదవ జార్జి తిలకించారు. వీరి ప్రదర్శనకు ఆనంద పరవశులై సువర్ణపతకమును బహూకరించారు.

వ్యాయామ రంగంలో ఎక్కువ ప్రోత్సాహం యిచ్చిన పొట్టి పంతులు గారి సిఫారసు మీద, తుని మహారాణి నాయుడుగారు సర్కస్ కంపెనీ నడుపుటకుగాను ధన సహాయం చేశారు. ఆ కంపెనీ పెద్దదై, భారత దేశమంతా ప్రదర్శనలను ఇచ్చింది. ఆ సర్కస్ కంపెనీలో 18 వందల

మందికి పైగా పనిచేశారు. నూరు మందికి పైగా భారతీయ వస్తాదులు ఉన్నారు. విదేశాల నుండి వచ్చినవారు 30 మందికి పైగా ఉన్నారు.

ఒక గ్రామంలో సర్కస్ విడిది చేసి ఉండగా, పెద్ద తుఫాను వచ్చింది. నాయుడుగారి గుడారం కూలిపోయింది. సర్కస్ ఏనుగు ఒక్కటి గొలుసులు త్రెంచుకొని నాయుడుగారు ఉన్న గుడారాన్ని భయంకరంగా త్రొక్కుతూ పోయింది. అది నాయుడుగారి రొమ్ము మీదగా నడిచింది. సర్కస్ కంపెనీ వారంతా భయభ్రాంతులయ్యారు. నాయుడు గారిని చూడగా వారు సురక్షితంగా ఉన్నారు. నాయుడు గారికి రొమ్ముమీద కొంచెం నొప్పి వేసింది. అప్పటి నుండి ఏనుగును రొమ్ము మీద ఎక్కించుకునే బల ప్రదర్శనను ప్రారంభించారు. భారతదేశంలో ఇట్టి బల ప్రదర్శనకు నాంది పలికింది వీరే.

1907 వ సంవత్సరంలో జర్మనీ బలశాలి ఈజెన్ శాండో మద్రాసు వచ్చారు. కుస్తీకి సవాలు చేసారు. ఆ సవాలుకు భారతదేశంలో ఎవ్వరూ అంగీకరించలేదు. నాయుడుగారు మాత్రం ప్రతి సవాలు చేశారు. నాయుడుగారు ఏనుగును రొమ్ము మీద ఎక్కించుకొన గల్గిన బలశాలి అని తెలియగానే, వేరే కారణం చెప్పి ఈజెన్ శాండో చల్లగా జారుకున్నారు.

1909 వ సంవత్సరంలో వీరి పరిస్థితులు బాగుండుట వలన యూరప్ దేశాలు పర్యటించి ప్రదర్శనలు ఇచ్చారు. విదేశాలలో వీరి ప్రదర్శనలు వేల సంఖ్యలో ఆకర్షించింది. లండన్‌లో ఉన్నప్పుడు బ్రిటీష్ చక్రవర్తి 'కలియుగ భీమసేను'నిగా కీర్తించారు. దేశ దేశాలలో బలప్రదర్శనలను యిచ్చి అజేయులుగా మాతృదేశానికి 1911 వ సంవత్సరంలో తిరిగి వచ్చారు. అదే సంవత్సరం ఐదవ జార్జ్ పట్టాభిషేకమునకు విచ్చేసిన ప్రముఖులందరూ నాయుడుగారి బలప్రదర్శనలను తిలకించి ఆశ్చర్యపడ్డారు. మల్ల విద్యా విశారదులైన గామాగారు కూడా నాయుడుగారి జట్టులో వుండేవారు. అసూయతో విదేశస్తులు చేసిన విషప్రయోగము వీరిని ఏమీ చేయలేక పోయినది.

నాయుడుగారు శాకాహారి. ధూమ మద్యపానములు ఎరుగరు. బాదము, సోపు, మిరియాలు మొదలగు వాటితో చేసిన పానీయము ఉదయం సేవించేవారు. 'టండా' అని ఆ పానీయమును పిలిచేవారు. మధ్యాహ్నం దంపుడు బియ్యం అన్నం, మంచిగా వేయించిన కందిపప్పుతో చేసిన పప్పు, మంచినెయ్యి, రేగడి పెరుగుతో భోజనం చేసేవారు. సాయంత్రం బాదము, మినుములు, గోధుమ పిండి, నెయ్యితో తయారయిన

'హరీరా' అనే హల్వాను తీసుకునే వారు. హనుమంతుని ఉపాసకులు. యోగ విద్య యందు వీరికి పూర్తి విశ్వాసం వుంది. హఠయోగ ప్రభావం వలననే అత్యంత భయంకరమైన ప్రదర్శనలను చేయగల్గారు. ప్రాణాయామ ప్రభావము మూలంగా ఏనుగును రొమ్ముపై ఎక్కించుకో గల్గారు. నాయుడుగారి ఛాతీ చుట్టుకొలత 48 అంగుళాలు. ఊపిరి బిగ పెట్టినప్పుడు 60 అంగుళాలు.

ఆయనగారు చేసిన సాహస కృత్యాలు కొన్ని:

1. ఏనుగును రొమ్ము మీదకు ఎక్కించుకొనడం.
2. రొమ్ము వీపుల మీద మోటారు కారును పోనిచ్చుకోవడం.
3. 1/4 అంగుళం మందం గల ఇనుప గొలుసును త్రెంచడం.
4. రెండు కార్లను గొలుసులతో కట్టి నడుముకు బిగించి, కదలనీయకుండా ఆపడం.
5. 3,000 పౌండ్ల బరువుగల రాతిని రొమ్ముపై వుంచుకొని, వేరొక రాతిని దానిపై వుంచి పగులకొట్టించుకొనడం.

భారతదేశంలో బాల గంగాధర్ తిలక్ గారి కోరికపై కాంగ్రెస్ మహాసభలలో ప్రదర్శనలను ఇచ్చి, అనేకమంది పెద్దల మన్ననలను పొందారు. దాన ధర్మాలలో దానకర్ణునిగా పేరు సంపాదించారు. సర్కస్ ప్రదర్శనలు యిచ్చిన ప్రతి చోటా బీదలకు అన్నదానం చేశారు. వీరు మేనాలో వెళ్తున్నప్పుడు రూపాయల సంచులు ప్రక్కనే పెట్టుకొని బీదలకు రూపాయలను విసురుతూ వెళ్ళేవారు. ప్రతి సంవత్సరం కోటి రూపాయలకు తక్కువ కాకుండా సంపాదించారు. ఆ డబ్బును దాచుకునేవారు కారు; బీదలకు పంచిపెట్టేవారు. బలశాలులలో యింతటి దానశీలురు యీనాటికీ పుట్టలేదనే చెప్పాలి.

అనివార్య కారణాల వల్ల తలవని తలంపుగా 1928 వ సంవత్సరంలో సర్కస్ కంపెనీని నిలుపుచేశారు. నాయుడుగారికి కష్టకాలం ప్రారంభమయింది. కోట్ల రూపాయలు దానధర్మాలు చేసిన వీరు మహాదారిద్ర్యం అనుభవించారు. వీరి బాధలను తెలుసుకున్న పండిత మదనమోహన మాలవ్య, కాశీ హిందూ విశ్వవిద్యాలయానికి ఆహ్వానించి, గౌరవ వ్యాయామ అధ్యాపకునిగా నియమించి ఆదుకున్నారు. హిందూ విశ్వవిద్యాలయం ఆవరణలో నిర్మించిన శివాజీ హాలుకి నాయుడుగారి చేతనే ప్రారంభోత్సవం చేయించారు.

మల్ల విద్య, ముష్టియుద్ధం, బల ప్రదర్శనలలో తొలిసారి భారతదేశానికి విశేష ఖ్యాతిని సాధించిపెట్టిన ఆంధ్రవీరుడు శ్రీ కోడి రామమూర్తి నాయుడుగారు 16 జనవరి 1938 న విజయనగరంలో తనువు చాలించారు. 'కలియుగ భీమ', 'ఆంధ్ర వీరకంఠీరవ', 'జగదేకవీర', 'మల్లరాజ తిలక' అను బిరుదములు పొందారు. వీరి శిష్యులలో శ్రీ రోళ్ళ సీతారామయ్య నాయుడు, శ్రీ పైడిరాజు, శ్రీ బులుసు రామజోగారావు, శ్రీ కె. బి. హరికృష్ణ శెట్టి మున్నగు వారు ముఖ్యులు.

స్వర్గీయ నాయుడుగారి ప్రధాన శిష్యులలో ఒకరైన స్వర్గీయ నాగమల్లి పైడిరాజు భారతదేశంలో అనేక ప్రదర్శనలు యిచ్చి, విజయనగరంలో కోడి రామమూర్తి వ్యాయామశాలను నెలకొల్పి, అనేక మంది యువకులకు శిక్షణ యిచ్చారు. పైడిరాజుగారి తీవ్ర కృషి ఫలితంగా 1984 వ సంవత్సరంలో వ్యాయామశాలకు భవనము ఏర్పాటు అయింది. 1991–92 వ సంవత్సరంలో విజయనగరం జిల్లా, బొబ్బిలిలో కోడి రామమూర్తి పేరు మీద వ్యాయామ విద్యా కళాశాలను నెలకొల్పుటకు ప్రభుత్వం ఆమోదం తెలియజేసింది.

★ ★ ★

# గౌస్ మహమ్మద్



వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో క్వార్టర్ ఫైనల్‌కు చేరుకున్న ప్రప్రథమ భారతీయుడు గౌస్ మహమ్మద్, ఉత్తరప్రదేశ్‌లోని మహలాబాద్‌లో రెండు, నవంబరు, 1915 వ జన్మించారు. బ్రిటీష్ వారి పాలనలో 1925 వ సంవత్సరంలో భారతదేశ ప్రతినిధిగా వింబుల్డన్ పోటీలలో క్వార్టర్ ఫైనల్‌కు చేరుకున్న యస్. హెచ్. జాకబ్ భారతీయులు కారు. గౌస్ మహమ్మద్ చిన్నప్పటి నుండి ఫుట్‌బాల్ మరియు టెన్నిస్ క్రీడలలో ఉత్సాహం చూపారు. అలిఘర్ విశ్వవిద్యాలయ కళాశాలలో చదివే రోజుల్లో టెన్నిస్ క్రీడకు ప్రాధాన్యం యిచ్చి, విశేష కృషి చేశారు. అలిఘర్ విశ్వవిద్యాలయ కళాశాల నుండి డిగ్రీ తీసుకున్నారు.

22 సంవత్సరాల యువకునిగా, 1936 వ సంవత్సరంలో జాతీయ స్థాయిలో వెలుగులోకి వచ్చారు. ఆ సంవత్సరం భారతదేశంలో జరిగిన అనేక ముఖ్యమైన టెన్నిస్ పోటీలలో విజయాలు సాధించారు. 1935 వ

సంవత్సరంలో శ్రీ వేజ్ వద్ద టెన్నిస్ క్రీడలో శిక్షణ పొందారు. 1936 లో సింహళం, తూర్పు ఆఫ్రికా దేశాల్లో భారత జట్టు ప్రతినిధిగా పర్యటించి, అనేక టెన్నిస్ పోటీలలో పాల్గొన్నారు. వీరి ప్రతిభవల్ల 1938 వ సం॥లో వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో పాల్గొనే అవకాశం లభించింది. ఆ సంవత్సరం రెండు రౌండ్లలో విజయాలు సాధించి, మూడవ రౌండ్‌లో ఓడిపోయారు. 1939లో మధ్య యూరప్, న్యూజిలాండ్, ఫ్రాన్స్, అమెరికా ఆటగాళ్ళతో భారత జట్టు ప్రతినిధిగా పోటీలలో పాల్గొన్నారు.

1938 వ సంవత్సరం ప్రప్రథమంగా భారతదేశ జట్టులో డేవిస్ కప్ పోటీలలో పాల్గొన్నారు. అదే సంవత్సరం క్వీన్స్ క్లబ్, ఫ్రెంచ్ చాంపియన్‌షిప్‌లలో కూడా పాల్గొన్నారు. పారిస్‌లో జరిగిన టెన్నిస్ పోటీలలో ప్రపంచ ప్రముఖ ఆటగాడయిన డోనాల్డ్ బిడ్జిని ఢీకొని, వారి వద్ద నుండి ఒక సెట్‌ను తీసుకున్నారు. ఆ పోటీలలో విజయం సాధించిన బిడ్జి మొత్తం పోటీలలో ఎవ్వరికి ఒక సెట్ కూడా యివ్వలేదు.

1939 వ సంవత్సరంలో వింబుల్డన్ పోటీల ద్వారా ఒక చరిత్రను సృష్టించారు. హాంగెరీ దేశానికి చెందిన ప్రముఖ క్రీడాకారుడు స్టిగెట్‌ను 6–2; 14–16; 1–6; 6–4; 6–4 గేములతో 3–2 సెట్లతో ఓడించి క్వార్టర్ ఫైనల్‌కు చేరుకున్నారు. ఈ పోటీ రెండు గంటల ముప్పది అయిదు నిముషాలు పట్టింది. ఆ ఏటి వింబుల్డన్ పోటీలలో యింత సుదీర్ఘపు పోటీ యింకొకటి ఏదీలేదు. క్వార్టర్ ఫైనల్‌లో ఆ సంవత్సరం విజేత అయిన రిగ్స్ చేతిలో గౌస్ మహమ్మద్ ఓడిపోయారు.

భారతదేశంలోనేకాక ఆసియా మొత్తం మీద వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో క్వార్టర్ ఫైనల్‌కు చేరిన ఘనత వీరికే లభించింది. గౌస్‌గారు అనేక పర్యాయములు డేవిస్‌కప్ పోటీలలో పాల్గొన్న భారత జట్లకు నాయకత్వం వహించారు. మొత్తం మీద జగత్ ప్రఖ్యాతి గాంచిన చెకొస్లావేకియాకి చెందిన మిటిక్, బ్రిటన్‌కు చెందిన కాలిన్స్, ఆలిఫ్, యుగొస్లావియాకు చెందిన పంసెక్, న్యూజిలాండ్‌కు చెందిన స్టీడ్ మ్యాన్ మున్నగు వారిని ఓడించారు. భారతదేశంలో జరిగిన వందల పోటీలలో విజయాలు సాధించారు. వీరి ఘన విజయాలకు కారణం అద్భుతమైన వేగం, యుక్తి, శక్తి, ఉల్లాసము, ప్రతిష్టమైన సర్వీసు. చెప్పతగ్గ బ్యాక్‌హాండ్, మంచి శరీర సౌష్టవం కలిగి, నియమ నిష్టలతో క్రీడా

జీవితాన్ని గడిపిన కొద్దిమంది ప్రపంచ టెన్నిస్ క్రీడాకారులలో వీరు ఒకరు.

1947 వ సంవత్సరంలో చివరిసారిగా డేవిస్ కప్ పోటీలలో భారత జట్టుకు నాయకత్వం వహించారు. ఆ సంవత్సరం ఫ్రాన్స్‌తో ఓటమి లభించింది. 1946లో సౌత్ క్లబ్ (కలకత్తా) టెన్నిస్ పోటీల క్వార్టర్ ఫైనల్‌లో సుమంత్ మిశ్రా చేతిలో ప్రప్రథమంగా ఓటమిని చవి చూచారు. తర్వాత ఒక్క సంవత్సరంలోగా నాలుగు పర్యాయములు సుమంత్ మిశ్రా చేతిలో ఓడిపోయారు. అంతే, 1947 నుండి ప్రథమ తరగతి టెన్నిస్ పోటీల నుండి విరమించారు.

ఈనాటి టెన్నిస్ క్రీడాకారుల సంపాదన అనాడు లేదు. ఈ నాటి పరిస్థితులు అనాడు వున్నట్లయితే గౌస్ కోట్లకు పడగలెత్తి వుండేవారు. ఆయన సంపాదన మంచి పేరు మాత్రమే. అదే వారి జీవితాన్ని కాపాడింది. 1948 వ సంవత్సరం నుండి హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. ఆర్థికంగా ఇబ్బందులకు గురికావలసి వచ్చింది. గౌస్‌గారు ఉచ్ఛస్థితిలో వున్నప్పుడు అంటిపెట్టుకొని చుట్టూ ప్రదక్షిణాలు చేసిన ధనమదాంధులు ఎవ్వరూ దగ్గరకు రాలేదు. ఆర్థికంగా బాధలు పడుతున్న సమయంలో హైదరాబాదు సైనికాధికారి జనరల్ జె. యన్. చౌదరిగారి నుండి పిలుపు వచ్చింది.

వెంటనే గౌస్‌గారు వెళ్ళగానే, చౌదరిగారు స్వయంగా స్వాగతం చెప్పి, అల్పాహార విందును యిచ్చారు. వారు చూపుతున్న మర్యాదకు గౌస్‌గారికి మతిపోయింది. అంతా అయిన తర్వాత గౌస్ గారిని ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వ్యాయామ అధ్యాపకునిగా నియమిస్తున్నట్లు చౌదరి గారు తెలియచేశారు. గౌస్ గారి ఆనందానికి అంతులేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అడుగుపెట్టిన తర్వాత, క్రీడారంగాభివృద్ధికి ఎనలేని కృషి చేశారు. వారి హయాంలో అనేక విశ్వవిద్యాలయ జట్లు అఖిల భారత విశ్వవిద్యాలయ పోటీలలో ఘన విజయాలు సాధించినవి. కొద్ది సంవత్సరాల అనంతరం క్రీడారంగ సంచాలకులుగా పదోన్నతిని పొందారు. కాని, గౌస్‌గారి టెన్నిస్ క్రీడారంగ సేవలను భారత ప్రభుత్వం గుర్తించలేదు.

అంతర్జాతీయ క్రీడారంగంలో పేరు సంపాదించిన భారతీయ క్రీడాకారులకు 1956 నుండి 'పద్మశ్రీ' 'పద్మభూషణ్' బిరుదులను ప్రదానం చెయ్యడం కేంద్ర ప్రభుత్వం ప్రారంభించింది. ప్రప్రథమంగా

భారత టెన్నిస్ రంగంలో గౌస్ గారిని కేంద్ర ప్రభుత్వం గుర్తించవలసింది కాని, గుర్తించలేదు. ప్రప్రథమంగా 1962 వ సంవత్సరంలో పద్మశ్రీ, 1967వ సం॥లో పద్మభూషణ్ బిరుదులతో రామనాథన్ కృష్ణన్‌ను కేంద్రప్రభుత్వం సత్కరించింది.

గౌస్ టెన్నిస్ రంగంలో ఉచ్ఛస్థితిలో వున్న రోజుల్లో మాజీ రాష్ట్రపతి స్వర్గీయ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ గౌస్ అభిమాని. వారి పోటీలను అనేకం తిలకించారు. ఒక పర్యాయం ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ గారు హైదరాబాదు విచ్చేసినప్పుడు గౌస్‌గారు కలవడం జరిగింది. గౌస్ గారిని చూసిన తర్వాత చాలా బాధపడ్డారాయన. 1971 వ సంవత్సరంలో 'పద్మశ్రీ' బిరుదుతో భారత ప్రభుత్వం గౌస్ గారిని సత్కరించింది.

1974 వ సంవత్సరంలో ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రధాన క్రీడల అధికారిగా పదవీ విరమణ చేశారు. పదవీ విరమణ అనంతరం గౌస్ గారి ఆరోగ్యం అంతగా బాగోలేదు. మే 1981 లో గొంతు కాన్సర్ వల్ల ఆస్పత్రిలో చేరారు. ఈ విషయం తెలుసుకున్న ఆనాటి భారత ప్రధాని స్వర్గీయ ఇందిరాగాంధీ, చికిత్స నిమిత్తం పది వేల రూపాయలను పంపించారు. డాక్టర్లు ఎంతో ప్రయత్నించారు. కానీ గౌస్ మహమ్మద్ 22 ఏప్రియల్ 1982 న కన్ను మూసారు. జన్మించింది ఉత్తరప్రదేశ్‌లో అయినా తెలుగు క్రీడాంగణాన్ని ప్రకాశింపచేసిన ప్రముఖుడు గౌస్.

★ ★ ★

# నల్లంరెడ్డి కృష్ణస్వామి



టెన్నిస్ క్రీడకు జాతీయ స్థాయిలో చివరి శ్వాస వరకు సేవచేసి తనువు చాలించిన స్వర్గీయ నల్లంరెడ్డి కృష్ణస్వామి మూడు అక్టోబరు, 1905 న జన్మించారు. గుంటూరు పాఠశాలలో చదివే రోజుల్లో టెన్నిస్ బంతితో ఫుట్ బాల్ ఆడటం ప్రారంభించారు. కాకినాడ పి. ఆర్. కళాశాలలో చదివే రోజుల్లో టెన్నిస్ క్రీడలో అడుగుపెట్టి, ప్రప్రథమంగా కళాశాల టెన్నిస్ నాయకుడిని ఓడించారు. రాజమండ్రి కళాశాలలో చదివే రోజుల్లో మద్రాసులో జరిగిన విల్సన్ కప్ ఫుట్ బాల్ పోటీలలో పాల్గొని ద్వితీయ స్థానం సంపాదించిన రాజమండ్రి కళాశాల జట్టు సభ్యులు. మరుసటి సంవత్సరం యిదే జట్టు విజేత అయింది. విశాఖపట్నంలో ఫుట్ బాల్ క్రీడలో బంగారు పతకం పొందారు. ఆ రోజుల్లోనే బాల్ బ్యాడ్ మింటన్ క్రీడలో కూడా తర్ఫీదు ప్రారంభించారు. టెన్నిస్ క్రీడలో ఉన్నత దశలోకి రావడానికి ఫుట్ బాల్, బాల్ బ్యాడ్ మింటన్ క్రీడలు

దోహదపడినవి. టెన్నిస్ క్రీడలో వీరికి గురువు స్వర్గీయ ఆర్.వి.వి.యస్. ప్రసాద్. వీరి ప్రోత్సాహం వల్లనే కృష్ణస్వామి గారు టెన్నిస్ క్రీడలో అంతర్జాతీయ స్థాయికి వెళ్ళగల్గారు.

1928 వ సంవత్సరంలో మద్రాసు న్యాయ కళాశాలలో చదివే రోజుల్లో, ప్రప్రథమంగా 1929 వ సంవత్సరంలో మద్రాసు యమ్.సి.పి. టెన్నిస్ డబుల్సు పోటీలలో ఆర్. వి. వి. యస్. ప్రసాద్‌కు జంటగా ఆనాటి దక్షిణభారత ప్రముఖ జంట అయిన యన్. వెంకట్రావ్, టి. బి. బాలగోపాల్ లను తుది పోటీలో వరుస సెట్లతో ఓడించి సంచలనం సృష్టించారు. మద్రాసు విశ్వవిద్యాలయ టెన్నిస్ జట్టుకు నాయకత్వం వహించి, లక్నోలో జరిగిన అఖిల భారత అంతర్ విశ్వవిద్యాలయ పోటీలలో విజయం లభింప చేశారు. అదే సంవత్సరం గుంటూరులో జరిగిన టెన్నిస్ పోటీల సింగిల్సులో ఆనాటి కేంబ్రిడ్జ్ బ్లూ అయిన ప్రముఖ క్రీడాకారులు కోట రామస్వామి గారిని ఓడించి, ప్రముఖ టెన్నిస్ క్రీడాకారులను ఆశ్చర్య చకితులను చేశారు. తదుపరి అఖిల భారత అంతర్ రాష్ట్ర టెన్నిస్ పోటీలలో ఘన విజయం సాధించిన మద్రాసు రాష్ట్రజట్టుకు ప్రాతినిధ్యం వహించారు.

1931 వ సంవత్సరంలో సౌత్ క్లబ్, కలకత్తా నిర్వహించిన పోటీలలో ఆనాటి ప్రముఖ బ్రిటీష్ ఆటగాడైన హారక్‌ను ఓడించారు. వారిని ఓడించిన ప్రప్రథమ భారతీయునిగా ఘనత సంపాదించారు. 1932 లో సింహళంలో అడుగుపెట్టి, అఖిల సింహళ పోటీలలో విజయం చేపట్టిన ప్రప్రథమ భారతీయులు వీరే. న్యాయ విద్య పూర్తి అయిన తర్వాత వీరు పిఠాపురం మహారాజా వారికి ఆంతరంగిక కార్యదర్శిగా నియమితులైనారు. వారే కృష్ణస్వామి గారికి టెన్నిస్ క్రీడలో ప్రోత్సాహం యిచ్చారు. 1930 లో కలకత్తాలో ఫ్రెంచి ఆటగాళ్ళతోనూ, 1931 లో బ్రిటీష్ జట్టు, జపాన్ జట్లతోనూ, 1932 లో ఇటాలియన్ జట్టుతోనూ, 1935 లో యుగొస్లావియా జట్టుతోనూ, 1936 లో మధ్యయూరప్ జట్టుతోనూ పోటీ చేసిన భారత జట్టు ప్రతినిధి. బెంగుళూరులో భారతదేశ పర్యటనకు వచ్చిన కోచస్‌తో పోటీ హోరా, హోరీగా జరుగుతున్న తరుణంలో గ్యాలరీ పడిపోవడంతో పోటీ నిలుపు చేయవలసి వచ్చింది. 1936 వ సంవత్సరంలో కెన్యాలో పర్యటించిన

భారత జట్టుకు వీరు నాయకత్వం వహించారు. అదే సంవత్సరం సింహళంలో జరిగిన పోటీలలో విజయం సాధించారు.

ఉన్నత శ్రేణి టెన్నిస్ పోటీల నుండి విరమించిన తర్వాత మద్రాసు టెన్నిస్, అఖిల భారత టెన్నిస్ సంఘాలకు కార్యదర్శిగా ఎన్నికైనారు. భారతదేశంలోని యువకులకు శిక్షణ ప్రణాళికలను అమలు చేశారు. శ్రీ రామనాథన్, కృష్ణన్ ప్రముఖ టెన్నిస్ క్రీడాకారులు కావడానికి కృషి చేసింది వీరే. కృష్ణస్వామి హయాంలోనే ప్రపంచ ప్రఖ్యాత శిక్షకులైన హేన్స్ నుసెలిక్ వద్ద రామనాథన్ కృష్ణన్‌కు శిక్షణ యిప్పించారు. జర్మనీ, అమెరికాలలో శిక్షణ పొందుటకు అఖిల భారత టెన్నిస్ సంఘం చేత కొంత సహాయం చేయించారు. పిఠాపురం మహారాజా వారి సహాయం కూడా వుంది.

ఏ భారతీయ ఆటగానికి లభించని సహాయ కార్యక్రమాలు కృష్ణన్ గారికి కృష్ణస్వామి లభింప చేశారు. రాజకుమారి శిక్షణ ప్రణాళిక ప్రారంభం కాగానే కలకత్తా, ఢిల్లీ, హైదరాబాదు, మైసూరు, బొంబాయి, మద్రాసులలో టెన్నిస్ శిక్షణ కేంద్రాలను ప్రారంభించి అనేక మంది యువకులకు శిక్షణ ఏర్పాటు చేశారు. మద్రాసులో బంతులు అందించే బాలుడు ధ్రువన్ చాలా బాగా ఆడ్తాడు. వృద్ధిలోకి రాగలడని భావించి, అతనికి ఉద్యోగం కూడా యిప్పించారు. ఉద్యోగంలో చేరిన తర్వాత టెన్నిస్ క్రీడకు తిలోదకాలు యిచ్చాడని తెలియగా, చాలా బాధపడ్డారు. ఇటువంటి సంఘటనలు కోకొల్లలు.

వీరు కొన్ని వందల ట్రోఫీలు, కప్‌లు సంపాదించారు. ఆ ఖరీదైన కప్పులు, ట్రోఫీలను యువ క్రీడాకారులకు బహూకరించి ప్రోత్సహించారు. వాలీబాల్, బ్యాడ్‌మింటన్, అథ్లెటిక్స్‌లలో కూడా మంచి పేరు సంపాదించారు. వీరి అన్నగారు నల్లంరెడ్డి వెంకట రామారావు అథ్లెటిక్స్‌లో మద్రాస్ ప్రెసిడెన్సీ పరుగు పందాలలో రికార్డులను సృష్టిచేసి, మద్రాసు గవర్నర్ లార్డ్ వెల్లింగ్‌టన్‌చే స్వయంగా యోగ్యతా పత్రాలను పొందారు. వీరి తమ్ముడు శ్రీ వేంకటేశ్వరరావు ప్రముఖ అఖిల భారత రైల్వే బాల్ బ్యాడ్‌మింటన్, టెన్నిస్ క్రీడాకారులు. కృష్ణస్వామి 1983 వ సంవత్సరంలో పరమపదించారు.

★ ★ ★

# యస్. ఎ. రహీం



ఫుట్ బాల్ క్రీడలో నిర్విరామ కృషిచేసి, అంతర్జాతీయంగా గొప్ప పేరు సంపాదించిన వ్యక్తి హైదరాబాదు వాస్తవ్యులు, స్వర్గీయ సయ్యద్ అహమ్మద్ రహీం. 1944 నుండి 62 వరకు హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ ఫుట్ బాల్ జట్లు భారతదేశంలో విజయఢంకా మ్రోగించాయంటే అందుకు కారణం స్వర్గీయ రహీం. అనేక అంతర్జాతీయ పోటీలలో భారత జట్టు ఘన విజయాలు సాధించాయి. చివరి శ్వాస వరకు ఫుట్ బాల్ రంగానికి ఎనలేని సేవ చేసిన త్యాగమూర్తి. అటువంటి మహానుభావుడు యీనాటికీ పుట్టలేదు.

రహీం చాలా పొట్టిగా వుండేవారు. మిడిల్ స్కూలులో చదివే రోజుల్లో ఫుట్ బాల్ క్రీడమీద ఆసక్తి కల్గింది. ఫుట్ బాల్ ఆడాలనే కోరికతో స్కూలులో వున్న ఆటస్థలంకు వెళ్ళి ఒక జట్టులో చేరారు. ఫుట్ బాల్ క్రీడా ప్రియులైన ఆ పాఠశాల ప్రిన్సిపాల్ స్వర్గీయ షాక్రాస్,

రహీం గారిని బయటకు పిలిపించి 'నువ్వు పొట్టివాడివి. ఆటకు పనికిరావు. స్కూలు జట్టులో నీకు స్థానం వుంటుందని ఆశపెట్టుకోవద్దు' అని నిరుత్సాహపర్చారు.

ప్రిన్సిపాల్ మాటలకు అధైర్యపడలేదు. ఆ తర్వాత రెండు, మూడు రోజులు రహీం గారి ఆట ప్రతిభను గమనించి స్కూలులో ప్రతి నెలా అయిదు రూపాయల స్కాలర్‌షిప్‌ను ప్రకటించారు. ఫుట్‌బాల్ ఆటగాళ్ళయిన నలుగురు అన్నగార్లు యింట్లో ఫుట్‌బాల్ ఆట పథకాన్ని చర్చించుకుంటుండేవారు. వారి చర్చలను రహీం గమనించేవారు. స్వయంగానే ఆట విధానాలను మెరుగుపర్చుకున్నారు. దారుల్ ఉల్‌ఉలూమ్ ఉన్నత పాఠశాల, ఆ తర్వాత సిటీ పాఠశాలకు ఆడారు. పాఠశాల ప్రిన్సిపాల్ అజాం గారు రహీంగారికి ఎక్కువ ప్రోత్సాహం యిచ్చారు.

కళాశాల స్థాయిలో సిటీ కళాశాల జట్టుకు ప్రాతినిధ్యం వహించారు. అలీఘర్‌లో జరిగిన అఖిల భారత అంతర్ కళాశాలల ఫుట్‌బాల్ పోటీలలో సిటీ కళాశాల హైదరాబాదు విజయం చేబట్టడమే కాకుండా గొప్ప ప్రావీణ్యం ప్రదర్శించిన రహీం గారికి ప్రత్యేక బంగారుపతకం లభించింది. సిటీ కళాశాల, యాజమాన్యం నెలకొల్పిన ఎలెవెన్ హంటర్స్ జట్టులో కూడా రహీం గారికే స్థానం లభించింది. దక్షిణ భారతదేశంలో జరిగిన అనేక ఫుట్‌బాల్ పోటీలలో రహీం ఎలెవెన్ హంటర్స్ తరపున పాల్గొని అనేక విజయాలకు కారకులైనారు. కొద్ది సంవత్సరాలకే ఆటగానిగా ఫుట్‌బాల్ రంగం నుండి తప్పుకొని ఎలెవెన్ హంటర్స్‌కు శిక్షణ యివ్వడం ప్రారంభించారు.

రహీం పట్టభద్రులు అయిన వెంటనే కాచిగుడ మిడిల్ స్కూల్లో ఉపాధ్యాయ వృత్తిని చేబట్టారు. అక్కడ నుండి ఉర్దూ షరీఫ్ పాఠశాలకు బదిలీ అయ్యారు. విద్యార్థుల చేత వ్యాయామం, డ్రిల్లు చేయించేవారు. వ్యాయామం మీద ఉత్సాహం వల్ల వ్యాయామ విద్యలో డిగ్రీ తీసుకున్నారు. ప్రప్రథమంగా ఏ పాఠశాలలో విద్య నభ్యసించారో అదే పాఠశాలలో వ్యాయామ ఉపాధ్యాయునిగా నియమితులైనారు. క్రీడారంగానికి నాల్గు సంవత్సరాలు దూరంగా వుండి ఫుట్‌బాల్ క్రీడాభివృద్ధిని చేబట్టారు. చాదర్‌ఘాట్ హైస్కూలు క్రీడాభివృద్ధికి కృషి ప్రారంభించారు. హైదరాబాదు ఫుట్‌బాల్ సంఘానికి 1942 వ

సంవత్సరం కార్యదర్శిగా ఎన్నికైనారు. జాతీయ పోటీలకు హైదరాబాదు జట్టుతోవెళ్ళి జట్ల ఆటతీరును పరిశీలించారు. వ్యాయామ కళాశాలలో, సహాయ ప్రధాన అధ్యాపకునిగా నియమితులైన తర్వాత ఫుట్ బాల్ జట్ల శిక్షణ చేపట్టారు.

రహీంగారి శిక్షణ అతి కఠినంగా ఉండేది. ఆయనగారు యిచ్చిన ప్రోగ్రాం ప్రకారం ప్రతి ఫుట్ బాల్ ఆటగాడు ఆడాలి. అందువల్లనే రాష్ట్ర, విశ్వవిద్యాలయాల, పాఠశాలల, పోలీసు జట్లు అనేక విజయాలు సాధించినవి. రహీం గారి శిక్షణ ప్రావీణ్యాన్ని ఫెడరేషన్ గుర్తించి, 1949 వ సంవత్సరంలో భారత జట్టును వీరి చేతిలో పెట్టారు. తనువు చాలించే వరకు భారత ఫుట్ బాల్ జట్టు శిక్షకునిగా వ్యవహరించారు. భారతజట్టులో ఎప్పుడూ హైదరాబాదు నుండి ముగ్గురు, నలుగురు ఆటగాళ్ళు వుండేవారు. రిక్కార్ తీసుకునే వాళ్ళు, పొగత్రాగే ఆటగాళ్ళకు రహీం జట్టులో స్థానం లేదు. భారతజట్టు ఎంపిక కూడా రహీం గారి చేతిలో వుండేది.

1956 లో మెల్బోర్న్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లో భారత జట్టు పాల్గొనుటకుగాను అనాటి అఖిల భారత స్పోర్ట్స్ కౌన్సిల్ అధ్యక్షులు పాటియాల మహారాజా అనుమతిని నిరాకరించారు. ఈ విషయం భారత ప్రధాని స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ వరకు వెళ్ళింది. వెంటనే ప్రధాని భారత ఫుట్ బాల్ జట్టుకు పచ్చజండా చూపించారు. ఆ ఒలింపిక్స్‌లో అదృష్టవశాత్తు సెమీఫైనల్‌కు వచ్చింది. ఫుట్ బాల్ పోటీల సమయంలోనే రహీం అస్వస్థులై, ఒలింపిక్ గ్రామ ఆస్పత్రిలో చేరడం జరిగింది. భారత జట్టు క్వార్టర్ ఫైనల్ ఆస్ట్రేలియా జట్టుతో ఆడుతుందని తెలియగానే ఆస్పత్రి నుండి వచ్చేసారు. ఆ పోటీలో భారతజట్టు 4-2 గోలుల విజయం కన్నులారగాంచి ఆనంద పరవశులైనారు. భారతజట్టులో హైదరాబాదు వాస్తవ్యులు అజీజ్, నూర్, లతీఫ్, అహమ్మద్ హుస్సేన్, బలరాం, జుల్ఫికర్ వున్నారు.

హైదరాబాదులో జాతీయస్థాయి ఫుట్ బాల్ శిక్షణ కేంద్రం నెల కొల్పాలనే అభిప్రాయంతో ప్రయత్నాలు రహీంగారు చేశారు. 1956 వ సంవత్సరంలో రాజకుమారి స్పోర్ట్స్ కోచింగ్ పథకం క్రింద హైదరాబాదులో 75 మంది ఆటగాళ్లు, 14 మంది శిక్షకులకు శిక్షణ యిప్పించారు. అదే సంవత్సరం భారతప్రభుత్వ విద్యాశాఖ ఆధ్వర్యంలో

భారతదేశంలోని విశ్వవిద్యాలయాల నుండి 34 మంది శిక్షకులకు మూడు వారాలు శిక్షణ ఏర్పాటు చేశారు. 1956 వ సంవత్సరంలో రాష్ట్ర సంఘం 80 మంది ఉత్తమ క్రీడాకారులకు ఒక నెల శిక్షణ ఏర్పాటు చేశారు. హైదరాబాదులో ఫుట్ బాల్ శిక్షకుల కమిటీని ఏర్పాటు చేయించారు. ఫుట్ బాల్ కోచింగ్ యిన్స్టిట్యూట్ నెలకొల్పుటకు తీవ్ర ప్రయత్నాలు జరిగాయి. 28 ఆగష్టు 1956 న రాజా ఛాలెంజ్ ఫుట్ బాల్ పోటీల బహుమతి ప్రదానోత్సవంలో పాల్గొన్న గవర్నర్ తమ ప్రసంగంలో శిక్షణ కేంద్ర స్థాపనను అభినందించి ప్రభుత్వ సహాయం తప్పక యిస్తుందని తెలియచేశారు. కోచింగ్ ఇన్స్టిట్యూట్ కు రహీం గారి పేరు పెట్టాలని పెద్దలు తీర్మానించారు.

11, జూలై 1959 న ఆంధ్రప్రదేశ్ ఫుట్ బాల్ సంఘం అవతరించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రసంఘానికి కార్యదర్శిగా రహీంగారినే ఎంపిక చేశారు. 1942 నుండి 1959 వరకు హైదరాబాదు, ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఫుట్ బాల్ సంఘాలకు వరుసగా 20 సంవత్సరాలు కార్యదర్శి అయిన ఆయనకు ఎదురు నిలబడే సహనం ఎవ్వరికీ లేకపోయింది. కార్యదర్శి పదవిని చేబట్టిన వెంటనే యువకులకు శిక్షణ ప్రారంభించారు. 1944 నుండి దక్షిణ మండల ఫుట్ బాల్ పోటీలలో హైదరాబాదు జట్టు ద్వితీయ స్థానం లభించడంతో విజయాలు ప్రారంభమయినవి. రాష్ట్రపాఠశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయాల రాష్ట్ర, సిటీ పోలీస్ జట్లు వీరి హయాంలో అనేక విజయాలు సాధించినవి. డూరాండ్ రోవర్స్, యమ్.యు.సి. ప్రెసిడెన్సీ కప్పుల అఖిల భారత ఫుట్ బాల్ పోటీలలో అనేక సంవత్సరాలు హైదరాబాదు సిటీ పోలీస్ జట్టు విజయాలు సాధించింది. రహీంగారికి అండగా రాష్ట్ర పోలీస్ శాఖ డైరెక్టర్ స్వర్గీయ శివకుమార్ లాల్ నిలబడ్డారు. రహీంగారి సిఫార్సులను గౌరవించి పోలీసు శాఖలో అనేక మంది క్రీడాకారులకు ఉద్యోగాలు యిచ్చారు. రహీంగారి సిఫార్సులను గౌరవించినందుకు అఖిల భారత ఫుట్ బాల్ పోటీలలో సత్ఫలితాలను చూపించారు. హైదరాబాదు జట్లు భారతదేశంలో జరిగిన అనేక అఖిల భారత పోటీలలో ప్రత్యర్థులను గడ గడలాడించినవి.

★ ★ ★

# విజయానంద్ (విజ్జీ)



మన దేశంలో భారత క్రికెట్ కంట్రోల్ బోర్డ్ ఏర్పడినప్పటి నుండి క్రికెట్ క్రీడాభివృద్ధికి ఎంతో సేవ చేసిన డా. విజయానంద్ 28 డిసెంబరు, 1905 న జన్మించారు. వీరిని విజయనగరం మహారాజకుమార్, విజయానంద్, విజ్జీ అని కూడా పిలిచేవారు. క్రికెట్ రంగంలో మాత్రం 'విజ్జీ'గా దేశ విదేశాలలో పరిచయం. బాల్యంలోనే క్రికెట్ క్రీడలో అడుగుపెట్టి, ఉన్నత విద్యకోసం ఇంగ్లండ్ వెళ్ళినా క్రికెట్ క్రీడను వదిలిపెట్టలేదు. భారతదేశం తిరిగి రాగానే కొంత కాలం విజయనగరంకు స్వంత ఖర్చులతో కొన్ని జట్లను పిలిపించి పోటీలు జరిపించారు. 1930 సంవత్సరానికి మంచి క్రికెట్ ఆటగానిగా పేరు సంపాదించారు. 1931వ సంవత్సరం వీరు మకాం బెనారెస్‌కు మార్చారు. వెంటనే ఉత్తరప్రదేశ్‌లో క్రికెట్ క్రీడాభివృద్ధిని చేబట్టారు.

అనాటి ప్రపంచ మేటి ఆటగాళ్ళయిన హాబ్స్, సట్‌క్లిఫే, కాన్‌స్టైంటైన్ మున్నగు వారిని భారతదేశం రప్పించి కొన్ని పోటీలను ఏర్పాటు చేయించారు. ఆ పోటీల వల్లనే భారత దేశంలో క్రికెట్ క్రీడకు బలం ఏర్పడింది. మహారాజ కుమార్ పన్నెండు జట్టును స్థాపించి భారతదేశం, సింహళంలోనూ అనేక పోటీలు ఏర్పాటు చేయించారు. వీరి జట్టులో సి. కె. నాయుడు కూడా వుండేవారు. ఆనాడు కూడా భారతజట్టును ఎంపిక చేయాలంటే ప్రళయంగానే వుండేది. ప్రప్రథమంగా ఇంగ్లండ్‌లో పర్యటించుటకుగాను భారత జట్టును ఎంపిక చేయుటకు క్రికెట్ బోర్డ్ ఢిల్లీ, పాటియాల, లాహోర్‌లలో రెండేసి క్రికెట్ పోటీలను నిర్వహించింది.

ఢిల్లీలో మొదటి ట్రైల్ పోటీ విజయనగరం పన్నెండు, ఘనశ్యామ్ పన్నెండు మధ్య జరిగింది. రెండవ ట్రైల్ పోటీలు పాటియాలలో పాటియాల మహారాజా, పట్వాడి నవాబ్ జట్ల మధ్య జరిగింది. మూడవ పోటీ లాహోర్‌లో మొదటి పోటీ పాసిబుల్ (Possible) ప్రాబబుల్స్ పన్నెండు జట్లు, రెండవ పోటీ ఆల్ ఇండియా, రెస్ట్ ఆఫ్ ఇండియా పన్నెండు జట్లమధ్య జరిగినది. ఆ రోజుల్లో క్రికెట్ క్రీడ మహారాజులు, జమీందార్ల చేతుల్లో వుండేది. అందువల్ల వారిని కించపరచరాదు.

నాలుగు ఫిబ్రవరి, 1932 న లాహోర్‌లో బోర్డు సమావేశమై, ఇంగ్లండ్ పర్యటనకుగాను పద్దెనిమిది మంది క్రీడాకారులతో భారత జట్టును ఎంపిక చేయడం జరిగింది. ఆ జట్టుకు పాటియాల మహారాజాను నాయకులుగానూ, ఘనశ్యామ్ జీను ఉప నాయకులుగానూ నిర్ణయించారు. విజయనగరం మహారాజ కుమార్ గారిని సంతోషపెట్టుటకుగాను వీరిని డిప్యూటీ ఉప నాయకులుగా నిర్ణయించారు. 12 ఫిబ్రవరి, 1932 న వికోరి, విజిటర్స్ పన్నెండు జట్లమధ్య పోటీ జరిగింది. ఆ పోటీ అనంతరం వీరు భారతజట్టులో పాల్గొనడం లేదని తెలియజేశారు. విజయనగరం మహారాజ కుమార్ గారిని భారతజట్టులో పాల్గొనేలా చేయాలని అనేక ప్రయత్నాలు జరిగినవి. చివరకు అనారోగ్యనెపంతో భారత జట్టు నుండి వైదొలగడం జరిగింది.

1932–33 లో యమ్.సి.సి. జట్టు భారతదేశంలో పర్యటించి, మొత్తం 34 పోటీలలో పాల్గొన్నది. అందులో 17 'డ్రా' కాగా, 16 విజయాలు సాధించింది. ఓడిపోయిన ఒక్క మ్యాచ్ విజయనగరం పన్నెండు

జట్టుతో జరిగింది. 1934 వ సంవత్సరంలో ఆస్ట్రేలియా నుండి ఒక జట్టు భారతదేశం వచ్చింది. విజయానంద్ మొయిన్–డి–దౌలా జట్టుకు నాయకత్వం వహించి, ఆస్ట్రేలియా జట్టుతో పోటీ చేశారు. 1935–36 లో ఉత్తరప్రదేశ్ జట్టుకు నాయకత్వం వహించి, అనేక పోటీలలో పాల్గొని ఎక్కువ పరుగులు సాధించి మంచి పేరు సంపాదించారు. 1936 వ సంవత్సరంలో ఇంగ్లండ్‌లో పర్యటించిన భారత జట్టు నాయకులు, ప్రప్రథమంగా మూడు టెస్ట్ పోటీలలో పాల్గొన్న భారత జట్టుకు నాయకత్వం వహించిన ఘనత వీరికి దక్కింది.

ఈ జట్టులో సి. కె. నాయుడు. కూడా వున్నారు. భారత జట్టు మూడు టెస్ట్ పోటీలలో పాల్గొన్నది. మొదటిది లార్డ్స్, రెండవది మాంచస్టర్, మూడవది ఓరల్‌లో జరిగినది. వీరి ఆట తీరును గుర్తించి ఎనిమిదవ ఎడ్వర్డ్ 'సర్'బిరుదును యిచ్చి సత్కరించారు. యమ్.సి.సి ప్రెసిడెంట్ లార్డ్ సమ్మర్స్ విజ్ఞగారికి జీవిత సభ్యత్వం యిచ్చి గౌరవించారు. అదే సంవత్సరం లార్డ్స్‌లో జరిగిన అంతర్జాతీయ క్రికెట్ సమావేశంలో భారత ప్రతినిధిగా పాల్గొని తిరిగి రాగానే వీరి దృష్టి రాజకీయాల మీదికి మళ్ళింది. 1937 వ సంవత్సరంలో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వంలో న్యాయశాఖామంత్రిగా పదవి స్వీకరించారు. తర్వాత గాంధీగారిని కలవడం, స్వాతంత్ర్య సమరంలో దిగడం జరిగింది. అందువల్ల క్రికెట్ క్రీడాకారునిగా కొనసాగడం సాధ్యపడలేదు. స్వాతంత్ర్య సమరంలో భాగంగా, వీరికి లభించిన 'సర్' బిరుదును విసర్జించారు. కాశీలోని వీరి భవనం రాజకీయ నాయకుల నిలయం అయింది. అందరితోపాటు విజయానంద్ కూడా కొంతకాలం అజ్ఞాతంలో గడిపారు.

స్వాతంత్ర్య సమరానంతరం, రాజకీయాలలో వుంటూ భారతదేశ క్రికెట్ క్రీడాభివృద్ధికి ఎక్కువ కృషి ప్రారంభించారు. కొంతకాలం పార్లమెంటు సభ్యులుగా వున్నారు. అప్పుడే భారత క్రికెట్ కంట్రోల్ బోర్డుకు అధ్యక్షులుగా ఎన్నికైనారు. అధ్యక్ష పదవిని అలంకరించిన వారిలో వీరు తొమ్మిదవ వారు. వీరు అధ్యక్షులుగా వున్నప్పుడు విదేశ క్రికెటర్లచే అనేక కేంద్రాలలో యువకులకు శిక్షణ ఇప్పించారు. 1956 లో ఆస్ట్రేలియా క్రికెట్ జట్టు భారతదేశంలో పర్యటించడానికి వీరే కారకులు. 1955, 1958 సంవత్సరాల్లో లార్డ్స్‌లో జరిగిన అంతర్జాతీయ క్రికెట్ సమావేశానికి భారత ప్రతినిధిగా పాల్గొన్నారు.

ఆకాశవాణి ద్వారా వీరి క్రికెట్ ప్రత్యక్ష వ్యాఖ్యానాలు ఎంతో ఆహ్లాదకరంగా వుండేవి. వీరి సేవలను గుర్తించి భారత ప్రభుత్వం 1958 వ సంవత్సరంలో "పద్మభూషణ్" బిరుదుతో సత్కరించింది. ఉత్తరప్రదేశ్ క్రికెట్ సంఘ అధ్యక్షులుగా చాలా కాలంగా వుండి చేతనయిన సేవ చేశారు. పూర్వాంధ్ర క్రికెట్ సంఘానికి స్వర్గీయ సి. కె. అధ్యక్షులుగా ఎన్నికైనారు. వీరి తరువాత 1957వ సంవత్సరం నుండి విజ్జీ అధ్యక్షులుగా వ్యవహరించారు. భారత క్రికెట్ క్రీడా రంగానికి ఆర్థికంగా ఎంతో సహాయం చేసిన పితామహులు వీరు, వారణాసిలో రెండు డిసెంబరు, 1965 న నిద్రలోనే శాశ్వతంగా కన్నుమూశారు. వీరి జ్ఞాపకార్థం అంతర్ మండల విశ్వవిద్యాలయ క్రికెట్ పోటీలకు విజ్జీ ట్రోఫీను 1966–67 నుండి ఏర్పాటు చేశారు. ఇటీవల విజయనగరంలో నెలకొల్పిన స్టేడియంకు వీరి పేరు పెట్టడం జరిగింది.

★ ★ ★

# దండమూడి రాజగోపాల్



వరుసగా మూడు ప్రపంచ ఒలింపిక్స్‌లో పాల్గొన్న ప్రప్రథమ తెలుగువారు స్వర్గీయ దండమూడి రాజగోపాల్, 13 అక్టోబరు 1916 న కృష్ణాజిల్లా గండిగుంట గ్రామంలో జన్మించారు. బాల్యం నుండి బలప్రదర్శనలో ఉత్సాహం చూపి, చదువును పక్కకు పెట్టారు. చిన్నప్పటి నుండి వారి శరీరం దృఢంగా వుండేది. దండలు, బస్కీలలో ఉయ్యాలు తోటలలో తీవ్ర కృషి చేశారు. వానపాముల గ్రామంలో శిష్ట్లా సోమయాజులు వ్యాయామ విద్యలను ప్రచారం చేస్తున్నారని తెలుసుకొని రాజగోపాల్ పదిహేడవ ఏట ఆ గ్రామం చేరారు. జాస్తి బాపయ్య చౌదరి, జి. పున్నయ్యగారల ప్రోత్సాహంతో వెయిట్ లిఫ్టింగ్‌లో అడుగుపెట్టారు. అడుగుపెట్టిన కొద్ది రోజులలోనే మంచిపేరు సంపాదించారు.

వెయిట్ లిఫ్టింగుతోపాటు వ్యాయామ, బలప్రదర్శనలు యివ్వడం మాత్రం మానలేదు. 1939 లో మద్రాసు నగరంలో ప్రదర్శనలను యిచ్చారు. వెంటనే బెంగుళూరు వెళ్ళి ప్రదర్శనలను యిచ్చి, కె. వి. అయ్యర్ శాండో గారి ప్రశంసలను పొందారు. ఆ ప్రోత్సాహంతో తన గురువులైన కొల్లి రంగదాస్, కె. వి. చౌదరి గార్లతో అనేక రాష్ట్రాలు పర్యటించి ప్రదర్శనలను యిచ్చారు. 1941 వ సంవత్సరంలో దక్షిణ భారత పర్యటన చేశారు. 1943, నూజివీడులో ఆంధ్ర సారస్వత సభలు జరిగినప్పుడు బలప్రదర్శనలు యిచ్చి, అడవి బాపిరాజు (గజ ఈతగాడు) మన్ననలు పొందారు.

నూజివీడులో వీరి బలప్రదర్శనలను తిలకించిన గౌ. యమ్. ఆర్. అప్పారావు జమీందార్ వీరికి అండగా నిలబడ్డారు. రాజగోపాల్ గారిచేత 1943 వ సంవత్సరంలో వానపాముల గ్రామంలో వ్యాయామ సంస్థను ఏర్పాటు చేయించి అప్పారావు జమీందారుగారు ప్రారంభోత్సవం చేశారు. 1944లో హైదరాబాదు, పూనా, బొంబాయి నగరాలలో బలప్రదర్శనలను యిచ్చారు. బొంబాయి ఆంధ్ర మహాసభలో సన్మానం పొంది, బిల్ హిల్ అనే అమెరికా దేశస్థుని ప్రశంసలను పొందారు. అక్కడే వీరు 'ఇండియన్ టార్జాన్' అనే బిరుదును పొందారు. వీరు ప్రదర్శించిన బలప్రదర్శనలలో ముఖ్యమయినవి కారు ఆపడం, ఇనుప గొలుసు త్రెంచడం, రెండెడ్లబండిని వీపుమీద పెట్టుకొని నడవడం మున్నగునవి.

1945 లో కలకత్తాలో జరిగిన ఆసియా శరీర సౌష్టవ పోటీలలో పాల్గొని ప్రథమస్థానం పొందారు. బరువు నెత్తు పోటీలలో కూడా బెంగాల్ రికార్డును అధిగమించారు. కాశీలో స్వర్గీయ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి సమక్షంలో ప్రదర్శనలను యిచ్చి, వారి మన్ననలను పొందారు. 1946 లో బెంగుళూరులో జరిగిన జాతీయ ఒలింపిక్స్‌లో మైసూరు జట్టులో పాల్గొని బంగారు పతకం సంపాదించారు. 1947 లో భారత జట్టు ప్రతినిధిగా బర్మాలో జరిగిన అంతర్జాతీయ బరువు నెత్తు పోటీలలో పాల్గొన్నారు.

1948 లో లండన్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లో భారత జట్టు ప్రతినిధిగా పాల్గొన్నారు. అదే సంవత్సరం లండన్‌లో జరిగిన 'ప్రపంచ శ్రీ' అంగ సౌష్టవ పోటీలలో పాల్గొన్నారు. కామన్ వెల్త్ బరువునెత్తు పోటీలలో పాల్గొని చతుర్ధస్థానం పొందారు. అప్పటి వరకు శాస్త్రీయ

పద్ధతులలో బరువు నెత్తడంలో ఎక్కువ అనుభవం లేదు. అందువల్ల అమెరికా వాస్తవ్యులైన బాచ్ హాస్మన్, లండన్‌కు చెందిన డబ్ల్యు పులాం గార్లవద్ద శిక్షణ పొందారు. 1950 వ సంవత్సరంలో వానపాముల గ్రామం నుండి విజయవాడకు మకాం మార్చారు. 1951 లో ఢిల్లీలో జరిగిన ప్రప్రథమ ఆసియా క్రీడలలో హెవీవెయిట్ తరగతిలో కాంస్య పతకం సాధించారు. ఈ పోటీలలో అసలు బంగారు పతకం సాధించవలసిన వారు. తమ రికార్డుకన్న 25 పౌనులు తక్కువ ఎత్తారు. 21 ఫిబ్రవరి, 1952 న మద్రాసులో జరిగిన జాతీయ ఒలింపిక్స్‌లో ప్రప్రథమంగా పూర్వాంధ్ర జట్టును నడిపించారు. హెవీ వెయిట్ తరగతిలో 780 పౌండ్లు బరువును ఎత్తి, బంగారు పతకం పొందారు.

19 జూలై, 1952 న ఫిన్లాండ్‌లో జరిగిన 15 వ ప్రపంచ ఒలింపిక్స్‌లో పాల్గొనడానికి వెళ్ళారు. తలవని తలంపుగా జ్వరం వచ్చినందువల్ల పోటీలలో పాల్గొనలేకపోయారు. 1954 లో ఢిల్లీలో జరిగిన జాతీయ ఒలింపిక్స్‌లో పాల్గొన్న పూర్వాంధ్ర జట్టుకు నాయకత్వం వహించారు. ఈ పోటీల్లో హెవీవెయిట్ తరగతిలో బంగారుపతకం సాధించడమే కాకుండా మూడు రికార్డులను స్థాపించారు. 1955 వ సంవత్సరంలో విజయవాడలో వ్యాయామ ప్రకృతి చికిత్సా కేంద్రం స్థాపించి, యువకులకు శిక్షణ యిప్పించడం ప్రారంభించారు. 1956 లో పాటియాలలో జరిగిన జాతీయ క్రీడా పోటీలలో పాల్గొని బంగారు పతకం సాధించారు. ఈ సందర్భంలోనే ఒక కొత్త రికార్డును కూడా నెలకొల్పారు. నవంబరు 1956 లో మెల్బోర్న్‌లో జరిగిన 16 వ ప్రపంచ ఒలింపిక్స్‌లో పాల్గొన్న భారత జట్టు ప్రతినిధి. వరుసగా వెయిట్ లిఫ్టింగ్‌లో మూడు ఒలింపిక్స్‌లో పాల్గొన్న తెలుగువారు యిప్పటికీ వీరే!

అంతర్జాతీయ స్థాయిలో గొప్పపేరు సంపాదించిన వీరు రాష్ట్ర క్రీడా రంగానికి సేవ చేయాలనే తలంపుతో 1949లో విశాలాంధ్ర ఒలింపిక్ సంఘం స్థాపించారు. అదే సంవత్సరం పూర్వాంధ్ర జిల్లాలకు క్రీడా పోటీలను నిర్వహించారు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం అవతరించగానే, విశాలాంధ్ర పేరును ఆంధ్రగా మార్పు చేయించి, భారత ఒలింపిక్ సంఘానికి అనుబంధం చేయించారు. ఆనాటి రాష్ట్ర ఒలింపిక్ సంఘానికి శ్రీ యమ్. ఆర్. అప్పారావు అధ్యక్షులు కాగా, రాజగోపాల్ గారు కార్యదర్శిగా వున్నారు.

రాష్ట్ర క్రీడా సంఘాల అభివృద్ధికి పూనుకున్న కొద్ది సంవత్సరాలకే ఆంధ్రప్రదేశ్ అవతరించింది. 17 ఫిబ్రవరి, 1959 లో ఆంధ్రా, హైదరాబాదు సంఘ పెద్దలను ఆహ్వానించి పాటియాల మహారాజా అధ్యక్షతన సమావేశం ఏర్పాటు చేశారు. ఆ తర్వాత ప్రప్రథమ ఆంధ్రప్రదేశ్ ఒలింపిక్ సంఘానికి సహాయ కార్యదర్శిగా రాజుగోపాల్ గారు ఎన్నికైనారు. కృష్ణాజిల్లా క్రీడారంగానికి చేతనైన సేవ చేస్తూ, దృష్టిని సినిమా రంగానికి మరల్చారు. 1966, 67 సంవత్సరాలలో రెండు చిత్రాలలో నటించారు. సినిమా రంగానికి తిలోదకాలు యిచ్చి, జిల్లాక్రీడారంగాభివృద్ధికి పూనుకున్నారు. వీరు ఆరు ఆగష్టు, 1981 న దివంగతులైనారు. వీరి సేవలను గుర్తించి విజయవాడలో నిర్మించిన ఇండోర్ స్టేడియంకు వీరిపేరు పెట్టారు.

★ ★ ★

# యస్. యమ్. హాది



ఆనాడు అన్ని క్రీడల్లోను విశేష ప్రజ్ఞను ప్రదర్శించి; క్రికెట్, టెన్నిస్, టేబుల్ టెన్నిస్ క్రీడల్లో అంతర్జాతీయ ఖ్యాతిని గడించి; అనేక రాష్ట్ర, జాతీయస్థాయి వ్యాయామ, క్రీడా సంస్థలలో అగ్రతాంబూలం పొందిన ఏకైక ఆంధ్ర క్రీడాకారులు స్వర్గీయ సయ్యద్ మహమ్మద్ హాది. వీరు హైదరాబాద్ క్రీడా కుటుంబంలో జన్మించారు. అయిదుగురు అన్నదమ్ములూ ప్రముఖ జాతీయ, అంతర్జాతీయ క్రీడాకారులు కావడం విశేషం. కర్నల్ సయ్యద్ ఆలీ రజా, సయ్యద్ మహమ్మద్ హాదీ, సయ్యద్ ఆలీ అక్బర్, సయ్యద్ మహమ్మద్ జవాద్, సయ్యద్ మహమ్మద్ హుస్సేన్‌లు క్రీడా పాండవులుగా గొప్ప పేరు సంపాదించారు.

అయిదుగురు అన్నదమ్ములలో హాదీ గారిని వ్యాయామ, క్రీడరంగ మేధావి అని చెప్పవచ్చును. సోమాజిగూడ, హుస్సేన్‌సాగర్ సమీపంలో

వీరి గృహం ఒక గొప్ప క్రీడా మ్యూజియంగా ఉండేది. ఇంటి దగ్గర వ్యాయామ, క్రీడా విషయాలు ముచ్చటిస్తూ కూర్చుంటే టైము తెలిసేది కాదు. అతర్జాతీయ స్థాయిల్లో వీరిలా క్రీడల హాట్రిక్‌ను చేసిన తెలుగు వారు యీ నాటికి లేరు.

1896 వ సంవత్సరంలో జన్మించిన హాదీ, తమ పదవ ఏటనే ఫుట్ బాల్ క్రీడ తర్ఫీదు ప్రారంభించారు. మదర్‌సా అలియా పాఠశాల జట్టులో ప్రాతినిధ్యం వహించి, కళాశాల పెద్దల దృష్టిలో పడ్డారు. పాఠశాల విద్య పూర్తి కాగానే నిజాం కళాశాలలో ప్రవేశించారు. పాఠశాలలో చదివే రోజుల్లోనే అలియా పాఠశాల, నిజాం కళాశాల విభాగంగా ఉండేది కాబట్టి, కళాశాల జట్టుకు ఆడారు. నిజాం కళాశాలలో చదివేరోజుల్లో కళాశాల విశ్వవిద్యాలయ జట్లలో ఉత్తమ ఫుట్ బాల్ క్రీడాకారునిగా పేరు సంపాదించారు. 1918–21 మధ్యకాలంలో హైదరాబాద్ మెర్రి గో రౌండ్ ఫుట్ బాల్ జట్టులో పాల్గొని, భారతదేశంలో జరిగిన అనేక ఫుట్ బాల్ పోటీలలో పాల్గొన్నారు. 1920 లో నిజాం కళాశాల క్రీడలలో పాల్గొని పదమూడు బహుమతులను సంపాదించి అథ్లెటిక్స్ చాంపియన్ షిప్‌ను సంపాదించారు.

నిజాం కళాశాలలో చదువు పూర్తికాగానే, ఇంగ్లండ్ కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించారు. అక్కడ ఫుట్ బాల్, హాకీ, టెన్నిస్, టేబుల్ టెన్నిస్ క్రీడల్లో ప్రావీణ్యం చూపించారు. విశ్వవిద్యాలయం జట్లలో విశేష ప్రతిభను చూపించి, కేంబ్రిడ్జి బ్లూను పొందారు. మూడు క్రీడల్లో బ్లూ సంపాదించిన ఆంధ్ర క్రీడాకారులు యీ నాటికి వీరేనని చెప్పాలి. అక్కడ యమ్. ఏ. పూర్తికాగానే, అమెరికా వెళ్ళి, పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో వ్యాయామ విద్యలో డిప్లమో సంపాదించారు. విదేశాలలో ఉన్న రోజుల్లోనే భారతజట్టు తరఫున డేవిస్ కప్ పోటీలలో నాలుగు పర్యాయములు పాల్గొన్నారు. ఇంగ్లాండ్‌లో ఉన్నప్పుడు టెన్నిస్, క్రికెట్ క్రీడలు ఒకే సీజనులో ఆడవలసినందువల్ల క్రికెట్ క్రీడలో పాల్గొనే అవకాశం లభించలేదు. భారతదేశం తిరిగి వచ్చిన తర్వాత క్రికెట్ క్రీడలో ఎక్కువ ఉత్సాహం చూపించారు. అందుకు ప్రతిఫలంగా 1936 వ సంవత్సరంలో విజ్జీ నాయకత్వం క్రింద ఇంగ్లాండ్‌లో పర్యటించిన భారత క్రికెట్ జట్టులో స్థానం లభించింది. 1934 వ సంవత్సరంలో స్థాపించబడిన హైదరాబాద్ క్రికెట్ సంఘ

స్థాపకులలో వీరు ఒకరు. అప్పటి నుండి వరుసగా 1941 వ సంవత్సరం వరకు హైదరాబాద్ జట్టులో రంజీ ట్రోఫీ పోటీలలో పాల్గొన్నారు.

1933 నుండి 38 వరకు బాల భటుల కమీషనర్‌గా పనిచేసిన వీరు ప్రధాన వ్యాయామ విద్యా పర్యవేక్షణాధికారిగా కూడా వ్యవహరించారు. 1938లో రాష్ట్ర విద్యాశాఖాధికారి అధ్యక్షతన నెలకొల్పబడిన వ్యాయామ విద్యాబోర్డుకు సభ్యులు. ఆ సంవత్సరం నుండి ప్రధాన వ్యాయామ విద్యా పర్యవేక్షణాధికారిగా కూడా నియమించబడ్డారు. 1939 నుండి ప్రభుత్వ వ్యాయామ కళాశాల ప్రిన్సిపాల్.

1939 లో హైదరాబాద్ ఫుట్ బాల్ సంఘ స్థాపకులలో వీరు ఒకరు. 1939 నుండి 42 వరకు కార్యదర్శిగాను, 1942 నుండి 52 వరకు అధ్యక్షులుగాను వ్యవహరించారు. హైదరాబాద్‌లో టెన్నిస్, హాకీ, అథ్లెటిక్స్, టేబుల్ టెన్నిస్ సంఘాల స్థాపనలో ప్రముఖపాత్ర వహించి, అనేక పదవులను నిర్వహించారు. బాల భటుల ఉద్యమంలో 1942 నుండి 52 వరకు గిత్ వెల్ (ఇంగ్లండ్)లో ప్రముఖపాత్ర వహించారు. హైదరాబాద్ విద్యాశాఖలో ఉప సంచాలకులుగా పనిచేసి, 1951లో రిటైర్ అయ్యారు.

రిటైర్ అయినా వారి వ్యాయామ క్రీడా రంగ సేవలను భారత ప్రభుత్వం తీసుకున్నది. 1952లో భారత ప్రభుత్వ వ్యాయామ, క్రీడల శాఖలో వీరిని సలహాదారునిగా నియమించింది. ఉర్దూ భాషలో ఫుట్ బాల్, వ్యాయామ విద్యమీద గ్రంథాలను రచించారు. పోలో, సైకిల్ పోలోలో కూడా అనేక విజయాలు సాధించారు. చాలా సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్ ఫుట్ బాల్ సంఘంకు ఉపాధ్యక్షులుగా ఉన్నారు. వీరి సేవలను గుర్తించి రాష్ట్ర ఫుట్ బాల్ సంఘానికి జీవిత సభ్యత్వం ఇచ్చి గౌరవించారు. ఇంతటి వ్యాయామ, క్రీడా మేధావి యీనాటి వరకు భారతదేశంలో జన్మించలేదనడంలో ఆశ్చర్యం లేదు. ఆ మహానుభావుడు సుమారు 80 ఏట క్రీడా జగత్తును వదిలి వెళ్ళారు.

★ ★ ★

# జె. ఎస్. రూసో



అథ్లెటిక్స్ అంతర్జాతీయ స్థాయి శిక్షకులుగా అర్హత పొంది, ప్రపంచ ఒలింపిక్స్ మరియు అంతర్జాతీయ పోటీలలో పాల్గొన్న భారత జట్టుకు శిక్షణ ఇచ్చిన ప్రప్రథమ తెలుగు క్రీడాకారులు స్వర్గీయ జయంతి సుధాకర రూసో 15 ఏప్రిల్, 1919 న బరంపురంలో జన్మించారు. కల్లికోట కళాశాలలో ఇంటర్మీడియట్ చదువుతున్న రోజుల్లో ఛాంపియన్‌షిప్ సాధించారు. ఇది వారి క్రీడా భవిష్యత్తుకు నాంది. 1938 నుండి 41 వరకు విశాఖపట్నం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చదివిన మూడు సంవత్సరములు అథ్లెటిక్స్‌లో ఛాంపియన్‌షిప్ సాధించి ఆంధ్ర విశ్వవిద్యాలయ జట్టుకు నాయకత్వం వహించారు. క్రికెట్, బాస్కెట్‌బాల్, ఫుట్‌బాల్ క్రీడలలో కూడా ప్రముఖపాత్ర వహించారు. 1945–46 మద్రాసు వై.ఎం.సి.ఎ.లో

వ్యాయామ శిక్షకులుగా శిక్షణ పొందారు. ఆ సంవత్సరం చెన్నరాష్ట్ర అథ్లెటిక్స్ పోటీలలో పెంటతలన్‌లో ఛాంపియన్‌షిప్ సాధించారు.

వీరి క్రీడా రంగ ప్రావీణ్యాన్ని గుర్తించి కేంద్ర ప్రభుత్వం విద్యాశాఖ రూసో గారిని ఉన్నత వ్యాయామ విద్యలో శిక్షణ పొందుటకుగాను ఎంపిక చేసింది. 1947–49 సంవత్సరాల్లో బ్రిటన్‌లోని ఎడింబరో కళాశాలలో ఉన్నత వ్యాయామ విద్య అభ్యసించడంతోబాటు ఫుట్‌బాల్, క్రికెట్, టెన్నిస్, ఈత మున్నగు క్రీడలలో శిక్షణా విధానాలను తెలుసుకున్నారు. అథ్లెటిక్స్‌లో కలర్ పొందారు. సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ఫిజికల్ రిక్రియేషన్, బ్రిటన్‌లో శిక్షణ పొందారు. బాస్కెట్‌బాల్, టెన్నిస్ క్రీడలలో శిక్షకునిగా శిక్షణ పొందారు.

బర్మింగ్‌హామ్ విశ్వవిద్యాలయం, కౌంటీ కౌన్సిల్, లండన్ కౌంటీ కౌన్సిల్, లీడ్స్, గ్లాస్కో విశ్వవిద్యాలయాలు, జోర్డన్ హిత్ కళాశాల, స్కాట్‌లాండ్ డఫర్ మెయిన్ స్త్రీల వ్యాయామ కళాశాలలో బోధనా పద్ధతులను తెలుసుకున్నారు. 1949 నుండి 52 వరకు భారత ప్రభుత్వ ప్రతినిధిగా విశ్వవిద్యాలయాలలో వ్యాయామ విద్యాబోధనా పద్ధతుల పరిశీలన నిమిత్తమై అమెరికాలో పర్యటించారు. కొలంబియా, న్యూయార్క్, బోస్టన్, అయోవా, మిచిగన్, ఓహియో, ఇలియానిస్, ఇండియానా, నార్త్ వెస్ట్రన్ మున్నగు అనేక విశ్వవిద్యాలయాలలో వ్యాయామ క్రీడలలో పరిశీలనలు జరిపారు. వ్యాయామ, క్రీడల నిర్వహణ విధానాలను తెలుసుకున్నారు. బాస్కెట్‌బాల్ క్రీడలో ఉన్నత శిక్షణ పొందారు. ఇలియానిస్ విశ్వవిద్యాలయంలో ఫుట్‌బాల్, అథ్లెటిక్స్, టెన్నిస్ క్రీడలలో శిక్షకులుగా పనిచేశారు. ఆనాడు వ్యాయామ, క్రీడా రంగాలలో తీవ్ర కృషి చేసి అత్యున్నత స్థానం అలంకరించిన తెలుగువారు వీరే.

1952 వ సంవత్సరంలో భారతదేశం వచ్చారు. రాగానే రెండు సంవత్సరాలు రాజపుతానా రైఫిల్స్ క్రీడాకారులకు వ్యాయామ క్రీడలు – ఈతలలో శిక్షణ ఇచ్చారు. వెంటనే సైనికదళం క్రీడాకారులకు శిక్షణ ఇచ్చారు. 1953 నుండి భారతదేశం తలపెట్టిన రాజకుమారి కోచింగ్ స్కీమ్‌కు ప్రధాన శిక్షకులుగా నియమించబడ్డారు. రాజకుమారి వ్యాయామ శిక్షణ కేంద్రం ద్వారా 15 రాష్ట్రాలలోని క్రీడాకారులకు, శిక్షకులకు, వ్యాయామ ఉపాధ్యాయులకు, భారత పోలీస్‌కు అథ్లెటిక్స్, ఈతలలో శిక్షణ ఇచ్చారు.

క్రీడా రంగాలు, వ్యాయామశాలలు, ఈత కొలనులు నిర్మించడంలో విశేష అనుభవం పొందారు. వ్యాయామ క్రీడలు, ఈత, బాస్కెట్‌బాల్, టెన్నిస్, క్రికెట్ క్రీడాకారులకు అంతర్జాతీయ ప్రమాణంలో శిక్షణ ఇవ్వడానికి అర్హత పొందిన ప్రప్రథమ తెలుగువారు వీరే. రాజకుమారి కోచింగ్ స్కీమ్ ద్వారా భారతదేశంలోని అనేక రాష్ట్రాల వ్యాయామ అధ్యాపకులకు శిక్షణ ఇచ్చి, క్రీడా బోధకులుగా తయారు చేశారు. వివిధ రాష్ట్రాలలో అథ్లెటిక్స్ శిక్షణ కేంద్రాలను నిర్వహించి, వేల మందికి శిక్షణ ఇచ్చారు.

1952 వ సంవత్సరంలో హెల్సింకీలో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లో పాల్గొన్న భారత అథ్లెటిక్స్ జట్టు శిక్షకులు, 1954 మనీలాలలో జరిగిన రెండవ ఆసియా క్రీడా పోటీలలో పాల్గొన్న భారత అథ్లెటిక్స్ క్రీడాకారుల శిక్షకులు. అదే సంవత్సరం జూన్ నుండి అక్టోబర్ వరకు బెంగుళూరు, విజయవాడ, హైదరాబాద్ నగరాలలో అథ్లెటిక్స్ శిక్షణ కేంద్రాలను నిర్వహించి, అనేక మంది వ్యాయామ అధ్యాపకులకు శిక్షణ మెలకువలను నేర్పారు. 15 రాష్ట్ర అథ్లెటిక్స్ శిక్షకులకు, వ్యాయామోపాధ్యాయులకు ఉన్నత శిక్షణ ఇచ్చారు.

రూసో కొంతకాలం రాజకుమారి అమృతకౌర్ అథ్లెటిక్స్ శిక్షణ కేంద్రానికి దర్శకులుగా వ్యవహరించారు. తదుపరి బెంగుళూరు ప్రభుత్వ వ్యాయామ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. వీరి పర్యవేక్షణలోనే జాతీయ శిక్షణ కేంద్ర నిర్మాణం జరిగింది.

1962 వ సంవత్సరంలో తమ పదవికి రాజీనామా చేసి, వారి వ్యాపార సంస్థ అయిన ధర్మతేజ షిప్పింగ్ కార్పొరేషన్‌కి సారథ్యం వహించారు. 1969 వ సంవత్సరంలో ట్రాక్ అండ్ ఫీల్డ్ అథ్లెటిక్స్ అనే శిక్షణ గ్రంథాన్ని స్వయంగా "Rousseau's Sports Publication" ద్వారా ప్రచురించారు. ప్రపంచ అతిరథ క్రీడారంగ పెద్దలను ఆకర్షించిన యీ గ్రంథాన్ని తండ్రి శ్రీ నారాయణ గారికి అంకితం ఇచ్చారు. ద్వితీయ ముద్రణ వెంటనే 1970లో జరిగింది. ఈనాటికీ బెంగుళూరులోని వీరి గృహంలో ఒక గది నిండా క్రీడా జగత్తులోని విజయాలను చాటి చెప్పే ట్రోఫీలు, షీల్డులు, వందల సంఖ్యలో నిండి ఉన్నాయి. ఒకనాటి కేంద్ర మంత్రి స్వర్గీయ కొత్త రఘురామయ్య మనుమరాలు వీరి కోడలు. ఈ ప్రముఖ క్రీడాగ్రేసరులు రెండు సెప్టెంబర్, 1979 న బెంగుళూరులో పరమపదించారు.





# రచయిత గురించి

3, డిసెంబరు, 1931 న గుంటూరు లో జన్మించిన శ్రీ ఏకా వేంకట సుబ్బారావు క్రీడారంగంలో రాష్ట్ర, జాతీయ స్థాయిల్లో ఏభై సంవత్సరాలకు పైగా నిర్విరామ కృషి చేస్తున్నారు. బాస్కెట్ బాల్ క్రీడలో "ఏకా" గా పరిచితులైన వీరు క్రీడాకారునిగా, శిక్షకునిగా, కార్యకర్తగా, ప్రోత్సాహకునిగా, విమర్శకునిగా, సమీక్షకునిగా, చరిత్రకారునిగా, గ్రంధ రచయితగా, ఆకాశవాణి, దూరదర్శన్‌లలో వ్యాఖ్యాతగా ఒక ప్రత్యేక స్థానం ఏర్పర్చుకున్నారు. ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో "తెలుగువారు-క్రీడారంగం" అనే చిరు గ్రంధాన్ని రచించారు. స్వయంగా కొన్ని క్రీడా గ్రంధాలను ప్రచురించారు. రాష్ట్ర ప్రభుత్వ స్టేషనరి డిపార్టుమెంట్‌లో సహాయ సంచాలకులుగా రిటైరయ్యారు. రెండున్నర సంవత్సరాల క్రితం గుంటూరులో సిటీ చిల్డ్రన్స్ క్లబ్‌ను స్థాపించి, తొమ్మిది సం॥ల లోపు చిన్నారులకు ప్రతి ఆదివారం అథ్లెటిక్స్‌లో పోటీలు నిర్వహిస్తూ చరిత్రను సృష్టిస్తున్నారు.